# ఆంధ్రకవులచరిత్రము

ద్వితీయభాగము

(మధ్యకాలపు కవులు)

కీ. శే. కందుకూరి వీరేశలింగము

ప్రకాశకులు

హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము

అక్టోబరు — 1986



'తెలుగు విజ్ఞాన పీఠము' హైదరాబాదు
వారు అందించిన ఆర్థిక సహాయమున
ముద్రితము

మూల్యము : రు. **50-00**

సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము.

కృతికర్త

నవ కవితా వైతాళికుఁడు



## కీ. శే. శ్రీ కందుకూరి వీరేశలింగము గారు

ఏమహనీయుఁ డీవి వెలయించి సమున్నతవిద్య నిల్పెనో,
ఏమహనీయుఁ డాత్మ నలరించు శతాధికకావ్యకర్తయో,
ఏమహనీయు దీపటిమ నింతుల వంతలు దూరమయ్యెనో,
ఆమహనీయుఁ, బూజ్యకవి, నాయుగపూరుషు నాత్మఁ గొల్చెదన్.

—శ్రీ యస్. వి. రాఘవేంద్రరావు

*To*

*Sri Raja Ravu*
*Venkata Kumara Mahipathi Surya Rao*
*Bahadur Garu,*
*Maharajah of Pithapuram,*
*This book is most respectfully dedicated*
*by the author.*

---

ఏను శ్రీపీఠికాపురాధీశ్వరునకు
నాంధ్రకవుల చరిత్రంబు నతిశయాను
రాగమున నంకిత మొనర్తు రావు శ్రీకు
మారమహిపతి సూర్యరాణ్మనుజపతికి.

కందుకూరి వీరేశలింగము

ప్రాప్తిస్థానము
హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము

# పరిచయం

శ్రీ కందుకూరి వీరేశలింగంగారు ఆంధ్రకవులచరిత్ర రచనకు 1886 వ సంవత్సరంలో శ్రీకారంచుట్టి 1894 వ సంవత్సరంలో పరిపూర్తి చేశారు. వారు కవుల చరిత్రని వ్రాస్తూ ఎప్పటికప్పుడు 'వివేకవర్ధని', 'చింతామణి' పత్రికల్లో ప్రచురిస్తూ వచ్చారు.

"ఆంధ్రకవుల చరిత్ర ప్రథమ భాగమును నేను 1887వ సంవత్సరమునందు ప్రకటించితిని." అని కందుకూరివారు తమ జీవిత చరిత్రలో పేర్కొన్నారు. ఆంధ్రకవుల చరిత్రను పూర్వాంధ్రకవులు, మధ్యకాలపుకవులు, ఆధునిక కవులు అని మూడు భాగాలుగా విభజించి 1890వ సంవత్సరంలో ఒకే ఒక్క సంపుటంగా వెలువరించారు. ప్రథమ భాగం 1894 వ సంవత్సరంలో ఒకసారి, 1897వ సంవత్సరంలో మరొకసారి ప్రచురించారు. ఆనాడు ఆంధ్రకవుల చరిత్రమీద వచ్చిన సమీక్షల్ని పరికించి, పండితమిత్రుల సలహాల్ని పాటించి శ్రీ వీరేశలింగంగారు కొన్ని మార్పుల్ని, చేర్పుల్నిచేసి నన్నపార్యుని మొదలు కవిరాక్షసునివరకు పూర్వాంధ్రకవులుగా విభజించి, 1917వ సంవత్సరంలో ప్రథమ భాగంగా ప్రకటించారు. వృద్ధాప్యకారణం చేత ఆంధ్రకవుల చరిత్ర తక్కిన రెండుభాగాల్ని శ్రీ వీరేశలింగంగారు తమ చేతిమీదుగా పరిష్కరించలేకపోయారు

శ్రీ వీరేశలింగంగారి కన్నా మున్నుగా శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు ఆంధ్రకవుల జీవితాల్ని రచించి 1878వ సంవత్సరంలోనే ప్రచురించారు. పెద్దాపురంనుండి ప్రకటింపబడే "శ్రీ ప్రబంధ కల్పవల్లి" అనే పత్రికలో ప్రచురిస్తూ ఉండేవారు. వారి కవుల జీవితరచనలో కాలక్రమాన్ని పాటించ లేదు. భారతాంధ్రకవులు, రామాయణాంధ్రకవులు, ఆంధ్ర పంచకావ్యకవులు ఇత్యాదిగా విభాగించి రచించారు. ఆకవుల జీవితరచన సమగ్రంగాలేక జనశ్రుతిలోని కథలతో, గాథలతో నిండిఉంది. అయినా గురుజాడ శ్రీరామ

మూర్తిగారి కవిజీవితాలు శ్రీ వీరేశలింగంగారి కవుల చరిత్ర రచనకు ప్రేరకమని చెప్పవచ్చు.

శ్రీ కందుకూరివారు తమకవుల చరిత్రలో కవులకాల నిర్ణయాలకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చారు. కవుల కావ్యాల గుణదోషాల్ని కూలంకషంగా కాక పోయినా దిఙ్మాత్రంగానైనా సమీక్షించారు. వారు నిర్ణయించిన కొందరి కవుల కాలనిర్ణయాల్ని ఆధునికు లంగీకరింపక విమర్శించారు. ఆవిమర్శనల్ని పరికించిన శ్రీ వీరేశలింగంగారు అలా జరగడానికి హేతువుల్ని తమ కవుల చరిత్ర పీఠికలోను, తమ జీవితచరిత్రలోను ఉల్లేఖించుకొన్నారు. ప్రథమ ప్రయత్నంలో ప్రమాదాలు దొరలడం వింతకాదు. విమర్శనీయంకాదు.

ఆనాటికి, అంటే శ్రీ వీరేశలింగంగారు కవులచరిత్ర వ్రాసేనాటికంటే నేడు అనేక శిలాశాసనాలు, తామ్రశాసనాలు బాహిరిల్లాయి. అనేక తాళపత్ర గ్రంథాలు వెలుగులోకి వచ్చాయి. క్రొంగ్రొత్తరీతుల్లో విశిష్ట పరిశోధనలు దారులు తీశాయి. స్థిరంగా కవుల కాలనిర్ణయాలు చేయడానికి వీలుపడు తున్నది. అయినా యింకా కొందరి కవులకాలనిర్ణయాలు ఊహాగానాలే. ఆనాటి కవులు తమ కావ్యాల్ని నృపాలాంకితం చేస్తూ వారి సాహ సౌదార్యాంశాల్ని వారి వంశానుక్రమణికల్ని, తమ రచనల్ని, తమ వంశాల్ని ఉటంకించుకొన్నారే కాని తమ జీవితచరిత్రాంశాల్ని లవలేశమైనా ఉల్లేఖించుకొన్నారుకాదు. ఆ కారణంగా వారి అభిరుచులు, అలవాట్లు, దినచర్య జీవితంలోని రసవత్తర ఘట్టాలు, అన్నీ విస్మృతికుహరంలోనే వుండిపోయాయి. అది ఆంధ్రుల దురదృష్టం. ఈనాటి వారివలె, ఆనాటి కవీశానులు స్వీయచరిత్ర ప్రస్తావనా ప్రలోభలోలుపులుగారేమో !

శ్రీవీరేశలింగంగారి మరణానంతరం వారి ఆంధ్రకవులచరిత్ర సమగ్రంగా సంస్కరింపబడకుండానే 1937 వ సంవత్సరంలో యథాతథంగా ముద్రణ పొందింది. తదుపరి 1940వ సంవత్సరంలో తృతీయభాగాన్ని హితకారిణీ సమాజం అచ్చొత్తించింది.

ఆంధ్రకవుల చరిత్రలో కొట్టొచ్చినట్టు కనిపిస్తున్న కొన్నిలోపాల్ని చక్క-దిద్ది ప్రచురించాలనే ఉద్దేశంతో మధురకవి శ్రీ నాళం కృష్ణారావుగారు, శ్రీ దంగేటి నారాయణస్వామిగారు అధ్యక్ష కార్యదర్శులుగానున్న హితకారిణీ సమాజం 1950వ సంవత్సరంలో ఆంధ్రకవుల చరిత్రని పరిష్కరించే బృహత్కార్యభారాన్ని ఆంధ్రచరిత్ర పరిశోధక వైదుషీధురంధరులైన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి భుజస్కంధాలమీద ఉంచింది సహృదయంతో ఆకార్యభారాన్ని స్వీకరించి సువిమృష్టంగా పరిశీలించి వారు ఆంధ్రకవులచరిత్రని సంస్కరించి 1952 వ సంవత్సర ప్రాంతాల్లో అవతారికతో పాటు హితకారిణీ సమాజంవారికి అందజేశారు. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారిని ఆబృహత్కార్యం నిర్వర్తించినందుకు హితకారిణీ సమాజం ఘనంగా సన్మానించింది.

ఆనాటినుండీ హితకారిణీ సమాజంవారు ఆంధ్రకవుల చరిత్రని తిరిగి ముద్రించడంకోసం బహుళ ప్రయత్నాలుచేస్తూనే ఉన్నారు. ప్రధానంగా ధనాభావమే ఈప్రయత్నానికి అవరోధమని మనవి చేయనవసరంలేదు. ఆంధ్రప్రదేశ ప్రభుత్వం అందించిన ఆర్థిక సహాయంతో శ్రీ మొండ్రేటి లక్ష్మీపతిగారు శ్రీ దంగేటి లక్ష్మణరావుగారు అధ్యక్ష కార్యదర్శులుగానున్న హితకారిణీ సమాజం 1978 వ సంవత్సరంలో ఆంధ్రకవుల చరిత్ర ప్రథమ భాగాన్ని ముద్రించింది.

1978వ సంవత్సరంలో ఆంధ్రకవులచరిత్ర ప్రథమ భాగం ముద్రణ పూర్తియైన వెనువెంటనే ద్వితీయ భాగాన్నికూడా ముద్రించి ఆంధ్రలోకానికి అర్పించాలని సంకల్పించి తత్ప్రయత్నాలు చేశాం. కాని సఫలీకృతులం కాలేక పోయాం. నాటికి నేడు మా ప్రయత్నం ఫలించి ఈ ద్వితీయ భాగాన్ని ముద్రిస్తున్నాం. ఈ ద్వితీయభాగ ముద్రణకు 'తెలుగు విజ్ఞాన పీఠం' ఆర్థిక సహాయం అందించినందుకు మేమెంతో కృతజ్ఞులం. దీని వెనువెంటనే తృతీయభాగాన్నికూడా ముద్రించడానికి పూనుకుంటామని సవినయంగా మనవి చేస్తున్నాం.

శ్రీ వీరేశలింగ కవీంద్రులు 1887 వ సంవత్సరంలో ఆంధ్రకవులచరిత్ర ప్రథమ, ద్వితీయభాగాల్ని అచ్చొత్తిస్తూ వ్రాసిన పీఠికను ఈ ద్వితీయ భాగంలో పునర్ముద్రించగలుగుతున్నాం.

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆంధ్రకవులచరిత్రలో నూతనంగా సంతనచేసిన కవుల్ని 'అనుబంధం'గా చేర్చాం.

వారు ఇందులో చేర్చిన విశేషాల్ని, అధస్సూచికల్ని [ ] బ్రాకెట్లచే సూచించాం.

ఇందులో ఇంకా ఏమైనా మార్పులు, చేర్పులు చేయవలసి ఉన్నా, పొసగిన దొసగుల్ని మలిముద్రణలో సవరించగలవారం.

సాకల్యంగా ఆంధ్రకవుల చరిత్రని పరిష్కరించి ఇచ్చిన చరిత్రచతురాననులు కీ. శే. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి మా కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు. మమ్మి ప్రోత్సహించి, మాతో సహకరించి ప్రథమ భాగాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది, ద్వితీయభాగ ముద్రణంలో తగు సూచనలిచ్చిన మా హితకారిణీ సమాజ ఉపాధ్యక్షులు విద్వాన్ శ్రీ సహదేవ సూర్యప్రకాశరావుగారికి, వలయు సహకారము నందించిన శ్రీ కందుకూరి వీరేశలింగం ఆస్తిక కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ యస్. వి. రాఘవేంద్రరావుగారికి మా కృతజ్ఞతాంజలులు.

పుస్తకం అచ్చువేసి ఇచ్చిన శ్రీ సరస్వతీ పవర్ ప్రెస్ వారికి మా అభివందనాలు,

మేడూరి సత్యనారాయణ
అధ్యక్షులు
జి. వి. నారాయణరావు
కార్యదర్శి
హితకారిణీ సమాజం.

రాజమహేంద్రవరం,
ది. 29-9-1986.

# మొదటికూర్పు పీఠిక

ఆంధ్రకవుల చరిత్రమును గూర్చిన మంచిపుస్తకము లేవియు నిదివఱకుఁ దెనుఁగున వ్రాయఁబడి యుండలేదు. బ్రహ్మశ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు కొందఱి చరిత్రములు వ్రాసినారుగాని యవకాశములేక కాఁబోలును వారిటీవల వ్రాయుట మానివేసినారు. చిరకాలమునుండి యుండియున్న యీకొఱఁతను వారింపఁ బూని నే నీప్రయత్నమునకుఁ బూనినాను. హిందూదేశములో చరిత్రములను వ్రాసెడి యాచారము పూర్వకాలమునుండియు లేకపోవుటచేత, కవులకాలమును దెలిసికొనుటయే దుర్ఘటముగా నున్నది ఇఁక వారి వృత్తాంతములను దెలుపుట యిప్పు డసాధ్యమని వేఱుగ చెప్పవలసిన పనియే లేదు. అయినను శిలాతామ్రశాసనాదులను బట్టియు కవులు తమకృతుల నంకితము చేసిన రాజుల కాలమును బట్టియుఁ గృతుల యవతారికలను బట్టియు దేశములో పరంపరగా వాడఁబడుచున్న కథలను బట్టియు సాధ్యమయినంతవఱకు నొకరీతిగా కాలనిర్ణయమును జేయుచు తెలుఁగుకవుల చరిత్రముల వ్రాయ నారంభించినాను. ఈపుస్తకము మూఁడు భాగములుగాఁ బ్రకటింపఁబడును. మొదటిభాగమునందు నన్నయభట్టారకుని కాలము మొదలుకొని శ్రీనాథాదుల కాలమువఱకు ననఁగా హూణశకము ౧౪౫౦వ సంవత్సరము వఱకు నున్నవారి చరిత్రము లుండును రెండవభాగమునం దాకాలము మొదలుకొని యప్పకవికాల మనఁగా హూణశకము ౧౬౫౦వ సంవత్సరమువఱకు నున్నవారి చరిత్రము లుండును. మూఁడవభాగమునం దాకాలము మొదలుకొని నేటివఱకు నున్నవారిచరిత్రము లుండును. ఇందు మొదటివారిని పూర్వకవులనియు, తరువాతి వారిని మధ్యకవులనియు, కడపటివారి నాధునిక కవులనియు, నేను వ్యవహరించుచున్నాను. శతకములను జేసినవారుగాక పురాణములను, ప్రబంధములను, స్మృతులను తెలుఁగునఁ జేసినవారు నాకిప్పటికి నూటయేఁబది మంది కంటె నధికముగాఁ గానఁబడుచున్నారు. వారిచరిత్రములన్నియు నీగ్రంథమందుండును.

ఇప్పుడు నేను జెప్పిన వారికాలములలోఁ గొంత వ్యత్యాస ముండవచ్చును. ముందు తగిన యాధారములు దొరికినప్పు డట్టి లోపములను దిద్దుటకయి ప్రయత్నించెదను. ఆంధ్రదేశాభిమానులును, పండితులును దీనియందున్న లోపములను దెలిపి దిద్దించినయెడల వారియెడల గడుఁగృతజ్ఞుఁడనయి యుందును, తక్కిన భాగములుకూడ శీఘ్రకాలము లోనే వెలువడును.

రాజమహేంద్రవరము.
ది. మెయి ౧౮౮౭సం॥

కందుకూరి వీరేశలింగము.

# ఉపోద్ఘాతము

మధ్యకవులచరిత్రమును నేనుఁ జింతామణిలోఁ బ్రచురింపనారంభించిన తరువాత నిద్దఱు విమర్శకులు నేనిందు వ్రాసిన కొన్ని యంశములపై ఖండనములు వ్రాసి యున్నారు. వారిలో నొకరు బ్రహ్మశ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులువారు; రెండవవారు బ్రహ్మశ్రీ పూండ్లరామకృష్ణయ్యగారు. ఈ యిరువురిలో మొదటివారయిన శ్రీరామమూర్తి పంతులవారు నా పుస్తకముపై విమర్శనముగల తమ కవిజీవితముల యొక్క రెండవ కూర్పు నొక ప్రతిని నాకు దయచేసి పంపినందున, వారికి కృతజ్ఞతాపూర్వకములయిన నావందనముల నర్పించుచున్నాను. నాపుస్తకముపయి ఖండనము వ్రాయ ననుగ్రహించిన రామకృష్ణయ్యగారి హరిశ్చంద్రనలోపాఖ్యాన పీఠికను సహితము నామిత్రులొకరి యొద్ద జూచి యానందించినాను. నావ్రాఁతలపైని యుక్తియుక్తములయిన యాక్షేపము నెవ్వరు చేసినను దురభిమానమును మాని దిద్దుకొనుటకు నేను సంసిద్ధుఁడనయి యున్నాను; అట్టిస్థితిలో పండితులయినవారు సత్యాన్వేషణము నపేక్షించి సహేతుకముగా లోపములను జూపినచో సంస్కరించుకొనుట నాకత్యంత సంతోషకరమని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు గదా! శ్రీరామమూర్తి పంతులవారు తమ కవిజీవిత ప్రకటనములో నేను వ్రాసిన పూర్వకవుల చరిత్రమును బేర్కొని "అందు పెక్కండ్రు కవుల పేరులును, వారి చారిత్రములును వ్రాసినట్లున్నను చాలా భాగము ఇదివరలో నాచేత ప్రకటింపఁబడిన కవిజీవితముల యర్థసంగ్రహమే కాని వేఱు కాదు." అని వ్రాసినారు. ఈ విషయమయి మా యిరువుర గ్రంథములను జదువఁదటస్థించినవారే తారతమ్య నిర్ణయము చేయఁదగినవారగుటచే నేనేమియు వ్రాయను. "అవియన్నియుఁ జేరి యొక గ్రంథముగా నేర్పడఁగా నందువలన నాంధ్రభాషకు కల్గిన లాభమేమియయ్యెననఁగా అవరలో కవిజీవితములలో నేర్పరుపఁబడిన కాలనిర్ణయములు పూర్వపక్షములగుటయును, కవి చరిత్రములో చేయఁబడిన తద్విషయకోపన్యాసములను బట్టి అట్టి నిర్ధారణచేయుటకు వీలు లేకుండుటయు తటస్థంబయ్యె" నని పంతులవారు వ్రాసి యున్నారు. నేను వ్రాసిన కవిచరిత్రమును బట్టి తామేర్పఱిచిన కాలనిర్ణయములు పూర్వపక్షములయ్యెనని వారే యొప్పుకొనుచున్నారు గదా? ఇంక నేను జేసిన కాలనిర్ణయమును నిర్ధారణము చేయుటకు వీలు లేకున్నదన్న విషయములో నేను జూపిన నిదర్శనములను వారు సహేతుకముగా ఖండించి ప్రబల ప్రమాణములను జూపువఱకును నేనేర్పఱిచిన కాలనిర్ణయము సరికాదని యంగీకరింప వలనుపడదు. నా పూర్వకవుల చరిత్రములోని కాలనిర్ణయమును గూర్చి వారు చేసిన యాక్షేపసమాధానములను నేనిప్పుడు మూడవసారి ముద్రింపింపఁబోవుచున్న యాపుస్తకమునందుఁ దెలిపెదను. ఈ మధ్యకవుల కాలనిర్ణయమును గూర్చి నేను జూచినంతవఱకు వారొక్క పింగళి సూరనార్యుని కాలవిషయములో భిన్నాభిప్రాయముకలవారయి యాకవి కాలము నేను జెప్పిన దానికంటె [illegible] సంవత్సరములు పూర్వమని

చూపఁబ్రయత్నించినారు. ఆర్వీటి బుక్కరాజు యొక్క (ప్రపౌత్రులు) మునిమనుమ లయిన రామరాజును తిరుమలరాయలును వరుసగా ౧౫౬౪, ౧౫౭౪ వ సంవత్సరముల వఱకును రాజ్యము చేసినట్టు నేను జెప్పిన దానిని శ్రీరామమూర్తి పంతులుగా రొప్పు కొనుచున్నారు; కాని, యార్వీటి బుక్కరాజు యొక్క (ప్రపౌత్రపౌత్రుఁడు)ముని మనుమని మనుమఁడైన (కళాపూర్ణోదయకృతిపతి) నంద్యాలకృష్ణరాజు ౧౫౬౧ వ సంవత్సర ప్రాంతముల యందు రాజ్యమారంభించి కృతినొందియుండునని నేనన్న దానికి మాత్రమొప్పుకొనక, ఏదో యింద్రజాలము చేసి మనుమఁడు తాతలకాలమున కంటె ముప్పది సంవత్సరములు ముందు కృష్ణదేవరాయని రాజ్యకాలములో నున్నట్లు స్థాపింపఁ జూచుచున్నారు. నేను బుక్కరాజు కాలమునందుకొని యక్కడినుండి కొడుకునకును తండ్రికిని వయస్సిరువది సంవత్సరములు హెచ్చుతగ్గుండవచ్చునని మిక్కిలి తక్కువగా కాలగణనము చేసి నంద్యాల కృష్ణరాజు రాజ్యకాలము ౧౫౬౦ వ సంవత్సర ప్రాంత మని వ్రాసి యున్నాను. పంతులవారు దానికంగీకరింపక రాజుల యధికారకాలము పదునేను సంవత్సరములుగా నిర్ణయింపవలెనుగాని యిరువది సంవత్సరములు కాదని యాక్షేపించిరి. వారు చూపిన కాలనిర్ణయమెట్లో నాకుఁ దెలియదుగాని యారాజ వంశమునందు వరుసగా తరముల వెంబడి నాలుపురుషాంతరముల వఱకును పురుషులకు పదునేను సంవత్సరములకే కొడుకులు కలుగుచు వచ్చిరని మాత్రము నేను నమ్మఁజాలను. వారీసిద్ధాంతమును జేయుటకయి నేను జూపిన యాధారముల నెల్ల నొకమూలకుఁ ద్రోచివైచి, కళాపూర్ణోదయములోని షష్ఠ్యంత పద్యములలో

క. విశ్రుత తిరుమలతాతా । ర్యశ్రేష్ఠాన్వయ సుదర్శనాచార్యతనూ

జ శ్రీనివాసగురుచర । ణాశ్రయణసమార్జితాఖిలాభ్యుదయునకున్.

అని కృష్ణరాజునకు ప్రసిద్ధుఁడయిన తిరుమల తాతాచార్యవంశజుఁడైన సుదర్శనాచార్య పుత్రుఁడగు శ్రీనివాసాచార్యుఁడు గురువని చెప్పిన దాని నాధారము చేసికొని ప్రసిద్ధుఁ డయిన తాతాచార్యుల తండ్రియు సుందరాచార్యుల కొడుకును నగు నొకానొక శ్రీనివాసాచార్యుని (తత్పూర్వులలో నెవ్వరో యొకరిద్దఱు తాతాచార్యు లున్నారన్న హేతువు చేత) విశ్రుత తాతాచార్య వంశజునిగాను, సుదర్శనాచార్య పుత్రునిగాను మార్చి మనుమఁడు తాత కంటెఁ బూర్వకాలపువాఁడయినట్టు సిద్ధాంతము చేసిరి. వారుదాహరించిన

శ్లో॥ పుత్రశ్చ సుందరార్యస్య శ్రీనివాసోభిధో గురుః ।

శ్రీనివాసగురోః పుత్రస్తాతార్యో లోకవిశ్రుతః ॥

అను శ్లోకములోనయినను శ్రీనివాసాచార్యుఁడు సుందరాచార్యుని పుత్రుఁడును విశ్రుతుఁడైన తాతాచార్యుని జనకుఁడునయినట్టు చెప్పఁబడి యున్నదికాని సుదర్శ

నాచార్యపుత్రుఁడయినట్టు చెప్పఁబడలేదు. సుందరాచార్యుఁనకును వర్ధనాచార్యుఁడన్న నామాంతరము కలదనియు, ఉన్నను కృష్ణరాజుగురువైన, శ్రీనివాసాచార్యుఁడే యీ శ్రీనివాసాచార్యుఁడనియు, నిదర్శనపూర్వకముగా స్థాపించువరకును పంతులవారి కాల నిర్ణయసిద్ధాంతము విశ్వసనీయము కానేరదు. రామరాజీయమను నామాంతరముగల నరపతి విజయములో "సాళువ నరసింహరాయరాజ్యప్రతిష్ఠాపనాచార్య" యన్న బిరుద మార్వీటి బుక్కరాజునకున్నట్టు చెప్పఁబడి నందున అతఁడు పదునేనవశతాబ్దాంతమునందున్న నిర్వి వాదాంశము. పింగళి సూరనార్యుని విషయమయి వాఁడబడుచున్న వాఁడనుట కథను గూడ సమన్వయింపఁ జేయుటకయి నేను నంద్యాలకృష్ణరాజు కాలమును ౧౫౫౦ వ సంవత్సరప్రాంతమని చెప్పితినిగాని దానిని మఱి పదిసంవత్సరము లీవలికి మార్చినను మార్చవచ్చును. నంద్యాల కృష్ణరాజు మార్వీటిబుక్కరాజు పెద్దకుమారుని సంతతివాఁడ గుటచేతను, చిన్నకుమారుని సంతతివాఁడయిన తిరుమలదేవరాయనికి వసుచరిత్రమును కృతియందు కాలమునాటికే యౌవరాజ్యాభిషిక్తుఁడైన మనుమఁడుండుటచేతను, నేను నిర్ణయించిన కృష్ణరాజు కాల మసంభావ్యము కాదు. ఈ కవి చరిత్రములను వ్రాయుటలో నాముఖ్యోద్దేశము, కవులకాలనిర్ణయాదులు మొదలయిన చరి త్రాంశములను దెలుపుటగానీ పుక్కిటి పురాణములను దెలుపుటకాదు. ఈ విషయమున నాకృషి కొంతవఱకు సఫలమయినను, ముందీకవులచరిత్రములను వ్రాయఁబూను సమర్థులయిన వారి కీపుస్తకము కొంత తోడుపడవచ్చును.

ఇఁకఁ బూండ్ల రామకృష్ణయ్యగారి యాక్షేపణలను గొంత విచారింతము, వసుచరిత్ర సరసభూపాలీయములను రచించిన కవి యొక్కఁడేయని చిరకాలమునుండి పండిత పామరసామాన్యముగా పారంపర్యముగా వచ్చుచున్న వాడుకను జెప్పి, యేతద్విషయ మయి యిద్దఱు నొక్కరేయనువారు చెప్పెడు హేతువులను గొన్నిఁటిని చేర్కొని, అవి యాలోచింపదగినవికాని త్రోసివేయఁదగినవి కావని నేను రామరాజభూషణ కవి చరిత్రమునందు వ్రాయఁగా, రామకృష్ణయ్యగారు కినుకపూని "పలుపద్యములలో నుపయోగింపఁబడిన విశేషణములు కొన్ని భిన్నములుగానున్నను వానినిబట్టి గ్రంథ కర్తలు భిన్నులని సాధించుటకు నాధారమేదియులేదు అని వీరేశలింగముగారు వ్రాసిన పుడిఁక యేమివ్రాసినను ప్రయోజనముండదుగదా" అని యొకచోటను, "ఆఖ్యా-నామ ధేయం-నను శబ్దద్వయముయొక్క యవయవార్థములను సావధానముగఁబరిశీలించి యుండిన వారిరువురు వేఱువేఱు కవులనియే ప్రకటించియుందురు" అని మఱియొక చోటను, వ్రాసి యింకొకచోట పున్నామ నరకమునుండి రక్షించువత్తుఁడేకాని కన్న వాఁడుకాఁడని గ్రహింపవలెను" అని నేను వ్రాసిన దానికి భ్రమపడి యపార్థము చేసి కొనియో, బుద్ధిపూర్వకముగా నేనన్నుఁ బరిహసింపవలెనన్న యుద్దేశముచేతనో రక్షించు నతఁడరువాత "వాఁడు" అను సర్వనామము నొకదానిని క్రొత్తగాఁజేర్చి నావాక్యము నకు స్వకపోలకల్పితమయిన విపరీతార్థమును జేసి నేను జేసిన యర్థమనర్థకమనియు,

కవులనందఱిని నేను నిరర్థకులని యందును గాఁబోలునని యీ, నేమేమో వ్రాసి తమ యపూర్వపాండిత్యమునంతను జూపి నన్ను గేలిచేసియున్నారు, రెండుపుస్తకములలో నున్న విశేషణములు కొన్ని భిన్నములుగానున్న హేతువుచేత గ్రంథకర్తలు భిన్నులని సాధించుట కాధారము లేదని వ్రాసిన నాకిఁక నేమి వ్రాసినను బ్రయోజనముండదని సిద్ధాంతముచేసిన రామకృష్ణ పండితులవారు వసుచరిత్రములో మూఁడు విశేషణము లుండఁగా నరసభూపాలీయములో నాలుగు విశేషణములు నుండుటచేతనే కవులు వేఱనెడి రీతియుక్తి రత్నములతోనే తమసిద్ధాంతమును స్థాపించు కొననిండు. ఆఖ్యా నామధేయశబ్దముల యవయవార్థ పరిశీలనముచేయుని నామాట యటుండనిండు. ఆ శబ్దముల యవయవార్థములను సావధానముగాఁ బరిశీలించిన రామకృష్ణయ్యగారు "ఆఖ్యా" శబ్దము పుట్టుపేరునకే కాని పెట్టుపేరునకు జెందదని సిద్ధాంతమొనర్చెదరు కాఁబోలును! హరిశ్చంద్ర నలోపాఖ్యానములోఁ దనవలనబుట్టినవాఁడని యర్థమిచ్చెడి యాత్మజ పదమును బ్రయోగించుటనుబట్టి సూరపరాజున కతఁడు కన్నకొడుకని యర్థ మిచ్చుచున్నదనియు, నరసభూపాలీయములో వారసుఁడనియర్థమిచ్చు పదమును బ్రయోగింపక పున్నామనరకము నుండి రక్షించువాఁడని యర్థమిచ్చెడి పుత్త్రశబ్దమును బ్రయోగించుటనుబట్టి దత్తుడుకూడ పాలకపితను పున్నామ నరకము నుండి రక్షించువాఁడగుటచేత వేంకటరాయభూషణునకతఁడు దత్తపుత్త్రుఁడని యర్థమిచ్చుచున్నదనియు, నేను వ్రాసితినేకాని (రామకృష్ణయ్యగారు కష్టపడి కల్పించినట్లు) దత్తుఁడేకాని కన్నవాఁడు పున్నామనరకమునుండి రక్షించువాఁడుకాఁడు మొదలయిన యంశములను నేనెక్కడను వ్రాసియుండలేదు.

రామకృష్ణయ్యగారి కడనున్న యూహలుకాని పాండిత్యముకాని నాకు లేకపోయినను నరసభూపాలీయ హరిశ్చంద్రనలోపాఖ్యానములలోని పద్యగద్యములను జదివినప్పుడు వారికివలెనే నాకును గ్రంథకర్తలు వేఱువేఱనియే తోఁచినది. అయినను కవిచరిత్రమును వ్రాయుటకయి యితరుల యభిప్రాయములను గ్రంథములనుగూడ సావధానముగాఁ బరిశీలించినమీఁదట నిరువురు కవులు నొక్కరే కావచ్చునన్న సందేహము నాకుఁగలిగినది. రామకృష్ణయ్యగారు వ్రాసినదానిని సావధానముగాఁ జదివినను నాకా సందేహమింకను నివారణము కాలేదు. ఇదివఱకు వ్రాసిన వానికిఁదోడుగా నాకా సందేహమును గలిగించుటకుఁ గారణములయిన మఱి రెండు మూఁడు హేతువులను గూడ నిప్పు డిందుఁ జేర్చుచున్నాను. వీనిని రామరాజభూషణకవిచరిత్రములోఁ జెప్పిన వానితోఁ జేర్చి చదివి బుద్ధిమంతులు తమ యిచ్ఛవచ్చిన సిద్ధాంతము చేసి కొనవచ్చును.

౧.— గీ. తా రచించిన వసుచరిత్రమునఁ గన్న
తండ్రి సూరన వెలయించి తల్లఁపఁడయ్యె

నన్ను మనశ్శారదామూర్తి నాఫలంబె
దత్తుఁడగు వానిఁ జేపట్టఁదరమె నాకు.

అనుచాటుధారాపద్య మొకటి రామరాజభూషణుఁడు తనవసుచరిత్రములో జనకపిత యైన సూరపరాజు పేరుదాహరించి తన్నుఁబేర్కొనక పోవుటచేత పాలకపితయైన వేంకటరాయభూషణునిచేఁ జెప్పఁబడినదని వాడుకలో నున్నది. ఈపద్యము కల్పితమని కాని, పెంచుకొన్న తండ్రికే స్వీకృతపుత్రుని విషయమున భ్రమకలిగినదనికాని, దీనికి సమాధానము చెప్ప వచ్చును. ఉన్న వాడుకను ఖండించి తమ సమాధానమును స్థాపింపఁజూచు వారికిఁ గల ప్రబల హేతువు లేవో!

౨— చతుర్భుజాభిషేకము, యౌవనచరిత్రము. గంగాగౌరీ సంవాదము, అను ప్రబంధములను రచించి ప్రసిద్ధుఁడయి వసుచరిత్రమునకు వ్యాఖ్యానము చేసిన సోమనాథకవి గ్రంథాదిపీఠికలో నిట్లు వ్రాసియున్నాఁడు—

శా. ఈరీతిం గవితావితానవృతగౌరీశానమూర్తిస్థలో
దారోద్దేశుఁడనైన నాకువెస విద్యావంతు లెల్లన్మనో
హారప్రక్రియ మూర్తిచేత రచితంబై విశ్రుతంబౌ వసు
క్ష్మారాట్చిత్ర చరిత్రటీకకయి యుత్సాహంబు పుట్టించినన్

ఉ. కారణజన్ముఁడై కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై
భూరికళాకలాపుఁడయి పొల్పు వహించెడు భట్టుమూర్తిచే
నీరితమై సుఖార్థవదహీన పదాస్పదమైన యావసు
క్ష్మారమణ ప్రవృత్తము సుసాధ్యము గాదు తలంచిచూడఁగన్.

అని యిందలి మొదటిపద్యములో వసుచరిత్రము "మూర్తి" చేత రచిత మనియు, రెండవపద్యములో "భట్టుమూర్తి"చే నీరితమైనదనియు, వ్యాఖ్యాత చెప్పియున్నాఁడు. ఈవ్యాఖ్యాత యేకాలము నందుండినవాఁడో సరిగా తెలియదుగాని, అప్పకవికిని నహోబలపతికిని దరువాత నత్యల్పకాలములోనే పదునేడవశతాబ్దాంతముననున్నట్లు తెలియవచ్చు చున్నది. పూర్వ కాలమునందే యితఁడిట్లు వ్రాయుటనుగూర్చి యేమి చెప్పెదరు? ఇతఁడిప్పటి యీ బుద్ధిమంతులకంటె నెక్కువ సావధానముగా గ్రంథమును బరిశీలించి, ఇప్పటివారు తమ వాదమున కనుకూలములుగా నుదాహరించెడు గద్యపద్యముల కన్నిఁటికిని బ్రతిపదార్థమును వ్రాసి విమర్శించిన వాఁడేకదా? ఇట్లు వ్రాసినవారందఱు బుద్ధిహీనులనియు భ్రమపడినవారనియుఁ దా మొక్కరుమాత్రమే బుద్ధిమంతుల మయి సత్యమును గనిపెట్టినారమనియుఁ దలఁచుకొను ధీమంతులకుఁ బ్రత్యక్ష లిఖితములకు విరోధముగా స్వకపోలకల్పితములయిన యూహలకధికప్రమాణములనుట కాధారమేమియున్నవి? 3.— అనేక గ్రంథములను చేసినకవులు సమానవర్ణనలు వచ్చెడు పట్టునతాము మొదట రచియించిన గ్రంథములోనుండి పద్యములను జేకొని యావశ్యకము

లైనమార్పులను జేసినతరువాత రచియించెడు గ్రంథములలోఁ జేర్చుకొనెడి యాచారము గలదు. తిక్కన సోమయాజి తననిర్వచనోత్తర రామాయణములో మూడవ యాశ్వాసమున,

చ. గుణమున లస్తకంబునను గోటిరయుగంబునఁ గేలఁదార భీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగిన మాడ్కిఁ దీప్రమా
ర్గణ నికరంబులొక్కట నరాతిబలంబులఁ గప్ప శార్ఙ్జ ని
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్.

అని రచించిన పద్యమునే విరాటపర్వము నాల్గవయాశ్వాసమునఁ గొంచెము మార్పుచేసి యీక్రిందిరీతిగాఁ బ్రయోగించియున్నాఁడు—

చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁజాల భీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగినమాడ్కిఁ దీ వ్రమా
ర్గణ నికరంబులొక్కట నరాతిబలంబులఁ గప్పగాండివ
క్వణనము రోదసీకుహరకర్పముంబగిలింపనుగ్రతన్.

ఇందు "తాగ" యనునది "చాల" గను "శార్ఙ్జ నిక్వణన" మనునది గాండివ క్వణనము గాను, మార్పఁబడినవి. ఈప్రకారముగానే వసుచరిత్రము ప్రథమాశ్వాసములోని

శా. రామక్ష్మావరు దానతోయతటినీ వ్రాతంబుకల్లోలినీ
స్వామింజెందయశంబు మేఘములఁబర్వంగల్గువర్షాశర
త్సామానాధి కరణ్యలబ్ధిఁ జటంజక్రాయుధుండొందుని
ద్రాము ద్రానుగత ప్రయోగములఁ జిత్రంబేక కాలంబునన్.

అనుపద్యము కొంతవఱకు మార్పఁబడి నరసభూపాలీయము ద్వితీయాశ్వాసములో;

శా. ఆమోదంబున శ్రీనృసింహవిభు దానాంభోనదుల్సాగర
స్వామిం జెందయశంబు మేఘములఁ బర్వంగల్గువర్షాశర
త్సామానాధికరణ్యశంక నచటం దామోదరుండొందు ని
ద్రాముద్రానుగత ప్రబోధములఁ జిత్రం బేక కాలంబునన్.

అని ప్రయోగింపఁబడియున్నది. ఇద్దఱునేక కవులయినందక్క నిట్టి ప్రయోగముల నెట్లు సాధువుగా సాధింతురు? ఇప్పటి బుద్ధిమంతు లామహాకవుల యందు గ్రంథచౌర్యము నారోపింతురేమో! ఈ విధముగానే వసుచరిత్రము ప్రథమాశ్వాసములోని

శా. ఆమందాకిని మౌళిఁబూని నను నర్ధాంగీకృతంజేసితా
నా మేల్మేలని యార్యయగ్గఁ బ్రణుతుండై తత్పదాంభోజయో

గామర్షంబున గంగతోనొమ్మరయఁ జూడాభోగసమ్యక్క్రియా
సామర్థ్యంబున వేఁడు శంభుఁడు కృతిస్వామిం గృపం బ్రోవుతన్.

అను శివస్తుతి పద్యార్థమును గొంచెము మార్చి యధికసారస్యము గలిగించి

శా. గంగం దాల్చితి వుత్తమాంగమున నన్ గైకోలు కావించి త
ర్థాంగీకారమునం బురంధ్రి నిను వామాంగంబునం దాల్పనే
శృంగారోన్నతిఁ జూడుమంచు గిరిజన్ శీర్షాపగాబింబిత
స్వాంగానందితఁ జేయు శంభుఁడు నృసింహాధీశ్వరుం బ్రోవుతన్.

అని నరసభూపాలీయములోఁ గవి ప్రయోగించియున్నాఁడు. మొదటి పద్యములోని కొన్ని పదముల శ్లేషార్థములనటుండనిచ్చిన యెడల, ఉభయ పద్యములలోను గంగను శిరస్సునఁ దాల్చి నన్నర్థాంగీకృతను జేసితివని పార్వతి కుపితురాలు కాఁగా శివుఁడామె కోపమును దీర్చుటకయి పాదములఁబడెనన్న యర్థము సామాన్యముగాఁ జెప్పఁబడినది. వీనిలో మొదటి పద్యమున శివుఁడు పార్వతికిఁ గోపశాంతి చేయలేకపోవుటయే కాక గంగకుఁ గూడ కోపము తెప్పించి యామెను వేఁడుకొన వలసిన వాఁడయ్యెను. రెండవ పద్యమున గంగాప్రతిబింబిత స్వరూపమును పార్వతికిఁ జూపి తానామెనుగూడ నుత్తమాంగముననే ధరించితినని భ్రమ కలిగించి శివుఁడామెను శాంతచిత్తురాలిని జేయఁ గలిగెను. ఈ రెండు కావ్యములకు నొక్కరినే కర్తలనుగాఁ జెప్పకపోయిన పక్షమున వారియందుఁ బదార్థచౌర్య మారోపింపవలసివచ్చును.

కవి చరిత్రములను వ్రాయఁబూను నావంటి వారికి గ్రంథసామగ్రి తక్కువ యగుటచేత కవుల కాలనిర్ణయాదులను సరిగా వ్రాయుటకాని, అందఱి చరిత్రములను వ్రాయఁ గలుగుటగాని, సాధ్యము కాదు. అయినను ముందువారికి మార్గదర్శకముగా నుండునన్న యపేక్షతో నాకుదొరికిన యల్పాధారములతోను పరిమిత గ్రంథసాహాయ్యముతోను నా శక్తికొలఁది నేదో యొకరీతి చరిత్రము వ్రాయఁబూనినాను. ఇందు తప్పులు కుప్పలుగా నుండవచ్చును. విద్వాంసులగువారు నన్ను పరిహసింపక వాత్సల్యముతో నాలోపములను జూపి దిద్దించియు నాయొద్దలేని గ్రంథములను నాకుఁ బంపియు నాయుద్యమమును గొనసాగింతురని విశ్వసించుచున్నాను. నేనిందు వ్రాసిన చరిత్రసంగ్రహములో ౧౬౫౦ వ సంవత్సరమునకుఁ బూర్వమునందుండి కవులందఱి యొక్క చరిత్రమును జేర్చితినని చెప్పఁజాలనుగాని యిందుఁ జేర్పఁబడిన కవులందఱును మాత్రమా కాలమునకుఁ బూర్వపువారే యని నిశ్చయముగాఁ జెప్పఁగలను. కృతికర్తలయొక్కగాని కృతిపతుల యొక్కగాని కాలమును దెలిసికొనుట కాధారములు చిక్కకపోవుట చేతను, అప్పకవీయాదిలక్షణ గ్రంథములలో నుదాహరింపఁబడియుండకపోవుట చేతను, ఇప్పుడు నాకు లభించియున్న గ్రంథములలోనే కొన్ని యప్పకవి కాలమునకుఁ బూర్వమునందు

రచియింపఁబడినవి యున్నను నేనవి విడిచి పెట్టియుండవచ్చును. మూఁడవభాగము ప్రచురింపఁబడునప్పుడట్టిలోపమును నాకుఁ జూపుట కితరులకవకాశము కలుగును. నరపతివిజయమును రచియించిన యందుగుల వెంకయ్య కాలమును నేనిందుఁ జెప్పినట్లు పదునాఱవ శతాబ్ద మధ్యమునఁ గాక పదునేడవ శతాబ్దారంభమునకు మార్పవలసి యున్నది. ఇప్పటి కాలము వఱకుఁగల యాధునిక కవుల చరిత్రమును గూడ శీఘ్రకాలములోనే ముగింపఁ బ్రయత్నించుచున్నాను.

రాజమహేంద్రవరము.
నవంబరు ౧౮౯౪ సం.

కం. వీరేశలింగము.

# విషయసూచిక

పుట

* ఈ గుర్తులుగల కవుల చరిత్రములు నూతనముగాఁ జేర్పఁబడినవి.

# ఆంధ్రకవుల చరిత్రము

## మధ్యకాలపు కవులు

### 1. పెనుమత్స వేంకటాద్రి

ఇతని తండ్రి పద్మరాజు ; తల్లి గన్నమాంబ. క్షత్రియుఁడు. ధనంజయ గోత్రుఁడు. ఇతఁడు "ఇందుమతీ కల్యాణ" మను ప్రబంధమును రచించినట్లు బమ్మెర కేసన, మల్లకవులు తమ "విష్ణు భజనానందము"నఁ దెల్పియున్నారు. 'ఇందుమతీ కల్యాణ' మిపుడు లభించలేదు. 'విష్ణు భజనానందము'నందలి వంశ వర్ణనమునుబట్టి యీతఁడు క్రీ.శ. 1500 ప్రాంతము వాఁడై యుండవచ్చునని 'ఆంధ్ర కవితరంగిణి'లోఁ గలదు.

### 2. పెనుమత్స గోపరాజు

ఇతఁడు పయి వేంకటాద్రికవికి సోదరుఁడు. ఇతఁడు "అంతర్వేది మాహాత్మ్యము" మున్నగు గ్రంథములను రచించి, రాజోలు తాలూకాలోఁగల ర్యాలి గ్రామమునందలి కేశవస్వామి కంకిత మొనర్చినట్లు 'విష్ణు భజనానందము'ను బట్టియే తెలియుచున్నది. ఇతని గ్రంథములేవియు లభించ లేదు.

### 3. అడిదము నీలాద్రికవి

ఇతఁడు సుప్రసిద్ధ కవియగు అడిదము సూరకవి వంశమునఁ బ్రాచీనుఁడు. పూసపాటి రాచిరాజుగారి వద్దగాని, ఆయన పుత్రులగు తమ్మిరాజు గారి వద్దగాని ఆస్థాన విద్వాంసుఁడుగ నీతఁడుండియుండును. ఇతఁడు 'రణ రంగవిజయ' మను కావ్యమువ్రాసి, అందు తన యేలిక యొక్క-

వీరవిహారమును వర్ణించెనని చెప్పుదురు. శాసనాధారములం బట్టి ఇతఁడు క్రీ. శ. 1458 ప్రాంతమున నుండవచ్చునని తోఁచుచున్నది.

## 4. వేమనకవి

ఇతఁడు సుప్రసిద్ధములైన 'వేమన పద్యము' లను రచించినకవి. రెడ్డిరాజుల వంశములోనివాఁడు. కొండవీడు, రాజమహేంద్రవరములను పాలించిన రెడ్డి రాజుల అనంతరము వెలసిన చిన్న చిన్న సంస్థానములలో నీతఁడొక కోవకుఁజెంది యుండవచ్చునఁట.

వేమన 'కటారుపల్లె'లో సమాధి నొందెనని తెలియుచున్నది. కాన ఆ యూరే యాతని నివాసమని కొందఱుతలఁచిరి. కాని, వేమనయే "ఊరు కొండవీడు; ఉనికి పశ్చిమవీధి, మూగచింతపల్లె మొదటి యిల్లు" అని చెప్పుటచే వేమన తొలినివాసము 'మూగచింతపల్లె' అనియు, తర్వాతి నివాసము 'కొండవీ' డనియుఁ దెలియుచున్నది.

వేమన కాలముం గూర్చి యభిప్రాయ భేదములు కలవు. ఇతఁడు 17-వ శతాబ్దివాఁడని బ్రౌను పండితుఁడును, 16-వ శతాబ్దివాఁడని క్యాంబెలు పండితుఁడును, 17వ శతాబ్దివాఁడని శతకవాఙ్మయ సర్వస్వకర్త శ్రీవేదము వేంకటకృష్ణ శర్మగారును, 15-వ శతాబ్దివాఁడని శతక వాఙ్మయ చరిత్ర కర్త శ్రీ వంగూరి సుబ్బారావుగారును, శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మ గారును, 16 వ శతాబ్దివాఁడని శ్రీ శేషాద్రిరమణ కవులును ; ఇట్లే మఱి కొందఱును విభిన్నరీతుల నభిప్రాయపడుచున్నారు. కృష్ణరాయల కాలమునయున్న ఎడపాటి ఎఱ్ఱాప్రగడ తన "మల్హణ చరిత్ర" లో వేమనను స్తుతించియున్నందునను, 16-వ శతాబ్ది చివఱనున్న తురగా రామకవి తన "నాగర ఖండము"న వేమనను స్తుతించినందునను వేమన 15-వ శతాబ్దివాఁడై యుండునని శ్రీ వంగూరి సుబ్బారావుగారి యభిప్రాయము. 'ఆంధ్ర కవి తరంగిణి' లోను శ్రీ సుబ్బారావుగారి యభిప్రాయమే సమర్థింపఁబడినది.

వేమన తొలుత స్వేచ్ఛాప్రవృత్తికలవడి, పిదప విరాగి యయ్యెన నియు, 'అభిరాముఁ'డను నాతనిని మోసగించి, ఆతనికి లభింపవలసిన ఆత్మ విద్యనాతని గురువువలనఁ దాను పొందెననియు-ఇంక నిట్టి కథల నెన్నిఁటినో చెప్పుదురు. ఇతని పద్యములు వేలకొలఁదినున్నవి. ప్రస్తావానుసారముగ ఇతరులు కూర్చిన పద్యములును కొన్ని యిందుఁ జేరియున్నవని విమర్శకుల యాశయము.

## 5. శ్రీకృష్ణదేవరాయలు

ఇతఁడా ముక్తమాల్యద యను నామాంతరము గల విష్ణుచిత్తీయమను ప్రబంధమును రచించిన మహాకవి. ఇతఁడు కవీశ్వరుఁడయి విద్వన్మహాకవుల నాదరించుటవలననే కాక మహారాజయి యనేకదేశములను జయించుటవలనఁగూడ సుప్రసిద్ధుఁ డయినవాఁడు. దక్షిణ హిందూదేశమును పాలించిన రాజులలో నింత దేశమును జయించి యేలినవాఁడును, ఇంత ప్రసిద్ధి కెక్కినవాఁడును, మఱి యెవ్వఁడును లేఁడు. కాఁబట్టి యీతని చరిత్రమును వ్రాయుటకు ముందీతని పూర్వ చరిత్రమును గూడ సంక్షేపము గాఁగొంత వ్రాయుట యుచితమని తోఁచుచున్నది.

ఈతని రాజధాని బళ్ళారి మండలములోని యానెగొందికి సమీపమున తుంగభద్రాతీరము నందున్న విజయనగరము. ఈ విజయనగరమునకు విద్యానగర మనియు నామాంతరము గలదు. ఈ పట్టణము విద్యారణ్యస్వామియని మహాప్రసిద్ధి గన్న మాధవా చార్యులవారి యాజ్ఞచేతఁ గట్టఁబడినది. ఈ మాధవాచార్య్య లాకాలమునందు బుక్కరాజువద్ద మంత్రిగా నుండెను. కంప భూపతి కుమారుఁడైన బుక్కరాజు క్రీస్తుశకము ౧౩౫౦ సంవత్సరము మొదలుకొని ౧౩౭౯వ సంవత్సరము వఱకును రాజ్యముచేసెను. ఈ రాజు హూణశకము ౧౩౩౬వ సంవత్సరము మొదలుకొని ౧౩౫౦ వ సంవత్సరము వఱకును గూడ తన యన్నయైన హరిహరరాజుతోఁ గలిసి రాజ్యము చేసెన నియు, ఆ కాలమునందుఁగూడ మాధవాచార్యుఁడే వారికి మంత్రి యనియు,

వారికి రాజ్యము మాధవాచార్యుని వలననే వచ్చెననియు, కొంద అందురుగాని యది యెంతవఱకు సత్యమో తెలియదు. బుక్కభూపాలుని తండ్రియైన సంగ (కంప) రాజొక చిన్న సంస్థానాధిపతియై యుండి, మహమ్మదీయులు దండెత్తి వచ్చి హిందూ రాజ్యమును నాశనముచేసి యోరుగంటి ప్రతాపరుద్రుని చెఱగొని పోయిన కాలములో తన రాజ్యమును పోఁగొట్టుకొని యుండును. కొందఱతఁడు గొల్లవాఁడని చెప్పుదురు. కాని యాతని పూర్వస్థితిని నిర్ధారణము చేయుటకుఁ దగిన యాధారము లేవియు నిప్పుడు కానరావు. ఈ హరిహర, బుక్కరాజులు సహితము ప్రతాపరుద్రుని యవసానదశయం దాతని సేనలో దండనాథులుగా నుండిరని యొకానొకరు వ్రాసి యున్నారు. ఏది యెట్లున్నను వీ రారంభదశలో రాజ్యహీనులయి యుండి తమ ధైర్యసాహసముల వలనను తమ కులగురువైన మాధవాచార్యుని బుద్ధిబలములవలనను రాజ్యము సంపాదించి, స్వతంత్రులై మాధవాచార్యుని మంత్రిగాఁ జేసికొని యాతని యాలోచన ననుసరించి వర్తించు చుండినట్టు మాత్రము నిశ్చయముగా తెలియవచ్చుచున్నది. మాధవాచార్యులు దానొక దేవత నుపాసించి యాదేవతను బ్రత్యక్షము చేసికొని యామె వరముచేత బుక్కభూపాలునకు రాజ్య మిప్పించెనని కొందఱును, లక్ష్మీ కటాక్షమును బొంది సన్నిహితురాలయిన లక్ష్మీదేవిని తన్నైశ్వర్య వంతునిగాఁజేయుమని కోరినప్పుడామె కాజన్మమునందు లక్ష్మి లభింపదని చెప్పఁగా జన్మాంతర తుల్యమైన సన్న్యాసమును స్వీకరించి వైభవములను బొందెనని కొందఱును వ్రాసి యున్నారు. ఇవి యిటీవలివారి బుద్ధికల్పితములు. ఇటువంటి కథలను కల్పించుటలో హిందువులకుఁ గల సామర్థ్యము మఱి యెవ్వరికిని గానఁబడదు. మాధవాచార్యులకుఁ బూర్వమునందు శంకరాచార్య పీఠమునకు వచ్చిన యతీశ్వరు లాశంకరుని వలెను, ఇతర సన్న్యాసులవలెను పాదచారులయి భిక్షాటనము చేయుచు, శిష్యపరంపరకు తత్త్వబోధను జేయుచు వచ్చిరి. ఈ మాధవాచార్యుఁడు బుక్కరాజు వద్ద మంత్రిగా నుండి సమస్త వైభవముల ననుభవించుచు సన్న్యసించినవాఁడగుట చేతఁ దాను సన్న్యాసి

యయ్యును తొంటివిభవములను విడువఁజాలని వాఁడయి జనులకుఁ దనయం దుఁ గల గౌరవాధిక్యము వలనను, రాజానుగ్రహము వలనను, గజాశ్వాం దోళనాది సమస్తరాజ చిహ్నములను ధరించి, పీఠాధిపతుల కిట్టి యైశ్వర్యచి హ్నము లుండవచ్చునని నిబంధనముచేసి సమర్థించుకొనెను. ఏనుఁగులతోను, గుఱ్ఱములతోను, వాద్యములతోను పల్లకులలో నెక్కి సర్వసంగపరిత్యాగు లయిన సన్న్యాసులు మహారాజ వైభవముతో సంచరించుట దేవతావరాయ త్తమని సాధించుటకై మనవా రీలక్ష్మీకథను తరువాతఁ గల్పించి యుందురు. సన్న్యాసాశ్రమమును స్వీకరించునపుడు మాధవాచార్యుల వారు విద్యారణ్యు లన్న నామమును స్వీకరించిరి. వీరికాలమునుండియే జగద్గురువుల మను కొనెడు స్మార్తాచార్య పీఠస్థులయిన యతుల కందఱకును గజాశ్వాదులును, వాద్యములును పెండ్లిపల్లకులును పరంపరగా వచ్చుచున్నవి. ఈ మాధవా చార్యుల వారు గొప్ప విద్వాంసులు. ఆదిశంకరుల తరువాత శంకరాచార్య పీఠమునకు వచ్చినవారిలో మాధవాచార్యులకుఁ బూర్వమునందుఁ గాని పరమునందుఁ గాని యింతటి పండితులు మఱి యెవ్వరునులేరు. ఈయన 'పరాశరమాధవీయ' మను పేర పరాశరస్మృతి కొక్కగొప్ప వ్యాఖ్యానమును, 'కాలమాధవీయ' మనునొక కాలనిర్ణయగ్రంథమును, 'శంకర విజయము' ను, 'విద్యారణ్య'మని ప్రసిద్ధిగన్న వేదభాష్యమును, నూటయెనిమిది యుపనిషత్తులకొక వ్యాఖ్యానమును, 'సర్వదర్శన సంగ్రహము'ను, 'మాధవ నిదానము'ను రచియించెను. రాఁబోయెడు విజయనగరరాజుల చరిత్రమును దివ్యజ్ఞానము చేత ముందుగానే తెలుపుచు నీ మహా విద్వాంసునిచే రచియిం పఁబడిన దన్న కాలజ్ఞానమను పుస్తక మొకటి కలదు, కాని యది విజయ నగర సంస్థానము క్షీణించిన తరువాత రచింపఁబడిన యాధునిక గ్రంథమయి యుండును.

మాధవాచార్యులవారు తుంగభద్రాతీరమునందున్న పంపానగరమునందు జన్మించిరి ; వీరు బుక్కభూపాలునికి కులగురువులు ; భారద్వాజస గోత్రులయిన తెలుఁగు బ్రాహ్మణులు: ఈయన తండ్రి మాయణుఁడు;

అన్న సాయణుఁడు. అన్నయందును తండ్రియందును గల గౌరవము చేత మాధవాచార్యుల వేదభాష్యములలోఁ గొన్నిటికి వారిపేరులు పెట్టెను. మాధవాచార్యులు తొంబది సంవత్సరముల ప్రాయమున సిద్ధి బొందిరఁట; ఈయన ౧౩౬౮-వ సంవత్సమునందు బుక్కరాజు మంత్రియై యుండిన ట్లొక తామ్రశాసనమువలనఁ దెలియ వచ్చుచున్నది. మాధవీయాది గ్రంథములలో మాధవాచార్యులవారు తమ వంశమును దెలుపుచు వ్రాసిన రెండు శ్లోకముల నిందుఁ జూపుచున్నాను—

శ్లో॥ యస్యబోధాయనం సూత్రం శాఖా యస్య చ యాజుషీ,
భారద్వాజకులం యస్య సర్వజ్ఞ స్స హి మాధవః.
శ్రీమతీ యస్య జననీ సుకీర్తి ర్మాయణః పితా,
సాయణో భోగనాథశ్చ మనోబుద్ధి సహోదరౌ.

బుక్కరాజు తరువాత నాతనికి కామాక్షీదేవివలనఁ బుట్టిన హరిహరనాథుఁడు ౧౩౭౯-వ సంవత్సరము మొదలుకొని ౧౪౦౧ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసెను. ఈ హరిహరరాజునకు మల్లాదేవి వలనఁ గలిగిన పుత్రుఁడైన వీరప్రౌఢదేవరాయలు ౧౪౧౨ వ సంవత్సరము వఱకును, ఆతని పుత్రుఁడైన విజయభూపతి ౧౪౧౮ - వ సంవత్సరము వఱకును, ఆతని కుమారుఁడైన దేవరాయలు ౧౪౨౨ వ సంవత్సరము మొదలుకొని ౧౪౪౭ వ సంవత్సరము వఱకును రాజ్యము చేసినట్లు శిలా తామ్రశాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. కాని వీరేయే సంవత్సరములయందు సింహాసన మెక్కిరో యేయే సంవత్సరములయందు పరమపదమును బొందిరో నిశ్చయముగాఁ దెలియదు. బుక్కరాజు కాలమునుండియు వీరికి మహమ్మదీయులతో యుద్ధములు జరుగుచు వచ్చెను. ౧౩౬౪ వ సంవత్సరమునందు మొట్టమొదట బుక్కరాజు మహమ్మదీయులను యుద్ధములో జయించెను. ఆతని పుత్రుఁడైన హరిహర రాజును మహమ్మదీయులతో యుద్ధముచేసి ౧౩౮౦ వ సంవత్సరమునందు తురుష్కులను గోవా నగరము నుండి వెడలగొట్టెను. ఈ హరిహరరాజు హిందూ దేవాలయముల కనేకములకు భూదానములు చేసెను.

హరిహరరాజు యొక్క కడపటి దినములలో సాళువ గుండరాజు మంత్రిగానుండెను. గుండరాజు జైమినీభారతము కృతి నందిన సాళువ నృసింహరాజు తండ్రి. గుండరాజు మంత్రిగాను, దండనాథుఁడుగాను ఉండి కొంతరాజ్యమును సంపాదించెను. తదనంతర మాతని పుత్రుఁడు సాళువ నృసింహరాజు దేవరాయలు సంతానము లేక మృతుఁ డగుటవలననో మఱి యేలాగుననో కర్ణాటకరాజ్యము నాక్రమించెను. నరసింహరాజునకు తిమ్మరాజను పేరుగల జ్యేష్ఠభ్రాత యొకఁడుగలఁడు. అతఁడే యీశ్వరరాజు తండ్రియైన సాళువ తిమ్మరాజని తోఁచుచున్నది. సాళువ నృసింహరాజు భూదానములు మొదలయిన దానము లనేకములు చేసెను. ఇతఁడు చిత్తూరుమండలములోని వందవాసినగరమునకు పడమట నామడ దూరములో నున్న వెల్లము గ్రామములోని దేవాలయమునకు శాలివాహన శకము ౧౩౯౧ వ సంవత్సరమునం దనఁగా-హూణశకము ౧౪౬౯ వ సంవత్సరము నందుఁ గొంత భూమి యిచ్చెను; ఈతని రాజ్యకాలములోనే చిత్తూరి మండలములోని యావూరు గ్రామములోని శివాలయమున కొకరిచేత శాలివాహనశకము ౧౩౯౩ వ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము ౧౪౭౧ వ సంవత్సరము నందుఁ గొంత భూమి యియ్యఁబడినది. ఈ నృసింహరాజు కాలమున తిమ్మరాజు పుత్రుఁడైన యీశ్వరరాజు దండనాథుఁడుగా నున్నట్లు వరాహ పురాణ పీఠికవలనఁ దెలియవచ్చుచున్నది. ఈ నృసింహరాజు మరణానంతర మీశ్వరరాజుపుత్రుఁడయిన నరసింహరాజు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు ౧౪౭౭ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసినట్లు శాసనముల వలనఁ దెలియవచ్చుచున్నది. కొంద ఱితఁడు ౧౫౦౯ వ సంవత్సరము వఱకు మాత్రమే రాజ్యపరిపాలనము చేసెననియు, ఆ సంవత్సరము మొదలుకొని యాతని జ్యేష్ఠపుత్రుఁడయిన వీరనృసింహరాయలు పరిపాలనము చేసెననియు చెప్పుచున్నారు. ఇదియే నిజమై యుండవచ్చును. పేరొక్కటియే యైయుండుటచేత శాసనములను పరీక్షించినవారు కొడుకును గూడ తండ్రినిగా భ్రమించి యుందురు. ౧౫౦౯ వ సంవత్సరమునందు కృష్ణదేవ

రాయల ప్రభుత్వమారంభమైనది. కృష్ణదేవరాయలు రాజ్యమునకు రాకముం దాతని యన్నయైన వీరనృసింహరాయలు కొంతకాలము రాజ్యము చేసినట్లు కృష్ణదేవరాయల కంకితము చేయబడిన గ్రంథముల యందెల్లను జెప్పఁబడి యున్నది :-

క. వీరనృసింహుఁడు నిజభుజ
దారుణ కరవాల పరుషధారాహతవీ
రారి యగుచు నేకాతప
వారణముగ నేలె ధర నవారణమహిమన్.

క. ఆ విభు ననంతరంబ ధ
రావలయముఁదాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁ గూర్చు దేవేరులుగన్-[మనుచరిత్రము]

క. వారలలోఁదిప్పాంబ కు
మారుఁడు పరిపంథి కంధిమంథాచలమై
వీరనరసింహరాయఁడు
వారాశిపరీత భూమివలయం బేలెన్.

శా. వీరశ్రీనరసింహశౌరి పిదపన్ విశ్వక్షమామండలీ
ధౌరంధర్యమున న్ఘనంబు ముదమంద న్నాగమాంబాసుతుం
డారూఢోన్నతిఁ గృష్ణరాయఁడు విభుండై రాజ్యసింహాసనం
బారోహించె విరోధులు న్గహన శైలారోహముం జేయఁగన్.-
[పారిజాతాపహరణము]

శిలా తామ్రశాసనాదుల వలనఁ దెలియవచ్చెడు పయి విధమునఁ గాక యీ వంశవిషయమయి పలువురు పలు విధముల పరస్పరవిరుద్ధముగా వ్రాసి యున్నారు, అందొక విధము నిందు క్రిందఁ గనఁబఱిచెదను.-

| | మొదలు-వఱకు |
|---|---|
| హరిహరరాయలు | 1336-1350 |

| | |
|---|---|
| బుక్కరాయలు | 1350-1379 |
| హరిహరరాయలు | 1379-1401 |
| విజయబుక్కరాయలు | 1401-1418 |
| పల్ల బుక్కరాయలు | 1418-1434 |
| గౌడదేవరాయలు | 1434-1454 |
| రాజశేఖర రాయలు | 1454-1455 |
| విజయభూపతి | 1455-1456 |
| ప్రౌఢదేవరాజు | 1456-1477 |
| వీరప్రతాపరాయలు | 1477-1481 |
| మల్లికార్జున రాయలు | 1481-1487 |
| రామచంద్రరాయలు | 1487-1488 |
| విరూపాక్షరాయలు | 1488-1490 |
| నరసింహరాయలు | 1490-1495 |
| నరసరాయలు | 1495-1504 |
| వీరనరసింహరాయలు | 1504-1509 |
| కృష్ణదేవరాయలు | 1509-1530 |

ఈ పట్టిక యొక్కటియే చాలవఱకు శిలా తామ్రశాసనములలోని కాలము ననుసరించి యున్నది.

కృష్ణదేవరాయలు జన్మించిన దినము గాని సంవత్సరము గాని సరిగాఁ దెలియదు. కృష్ణరాయలజనన మొకరు ౧౪౭౧ వ నంవత్సరము నందనియు, ఇంకొకరు ౧౪౯౨ వ సంవత్సరము నందనియు వ్రాసి యున్నారు గాని యం దేది సత్యమయినదియు నిశ్చయించుట కాధారము లేవియు దొరకలేదు. ఇతఁడు శాలివాహనశకము ౧౩౯౨ వ సంవత్సరము నందనఁగా క్రీస్తుశకము ౧౪౭౧ వికృతి సంవత్సర పుష్యబహుళ ద్వాదశీ

శుక్రవారమునాఁడు పుట్టినట్టు తెలిపెడి యీ క్రింది పద్య మొకటి వాడుకలో నున్నది :—

ఉ. ఆందలి శాలివాహన శకాబ్దము లద్రివసుత్రిసోములన్
వందితమైన యవ్వికృతి వత్సరమందలి పుష్యమాస మం
దుం దగు కృష్ణపక్షమున నుండెడి ద్వాదశి శుక్రవాసరం
బుం దుదయించెఁ గృష్ణుఁడు శుభాన్వితుఁ డానరసింహమూర్తికిన్.

ఇది యెంతవరకు విశ్వసింపఁదగినదో బుద్ధిమంతులగువా రాలోచించు కొందురుగాక ! అయినను, ఇది మొదటివారు చెప్పిన కాలముతో సరిపోవు చున్నందున దీని నధికవిశ్వాసార్హముగా నెంచవచ్చును. ౧౮౭౫ వ సంవత్సరములో కావలి వెంకట రామస్వామి గారు కలకత్తానగరము నందుఁ బ్రచురించిన దక్షిణహిందూదేశ కవుల చరిత్రములో కృష్ణరాయలు తన నలువదవయేట శాలివాహన శకాబ్దములు ౧౪౪౯ వ సంవత్సరమునం దనఁగా క్రీస్తుశకము ౧౫౨౪ వ సంవత్సరమునందు మృతినొందినట్టు వ్రాసియున్నారు. దీనినిబట్టి చూడగా నీరాయలవారు హూణశకము ౧౪౮౪ వ సంవత్సరమునఁ బుట్టి నట్టేర్పడుచున్నది. అల్లసాని పెద్దన్న చెప్పినట్టు చాటుధారగా వచ్చుచున్న యీ క్రింది పద్యములనుబట్టి కూడ కృష్ణదేవరాయల మృతికాల మించు మించుగా దీనితో సరిపోవుచున్నది.

ఉ. బోరన యాచకప్రతతి భూరి విపద్దశ నొందుచుండఁగా
నారయ శాలివాహనశకాబ్దము లద్రియుగాబ్ధి సోములం
దారణ వత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధ ష
ష్ఠీరవివాసరంబున నృసింహుని కృష్ణుఁడు చేరె స్వర్గమున్
ద్వారక నున్న కృష్ణుఁడవతారసమాప్తము నొందు కైవడిన్

ఈ పద్యమును బట్టి శకాబ్దములు ౧౪౪౭ టికి సరియయిన హూణ శకము ౧౫౨౫ వ సంవత్సరమునఁ గృష్ణరాయ లంతరించినట్లు కానఁబడు చున్నను, ౧౫౩౦వసంవత్సరమువఱకు నాతని దానశాసనములు విస్తారముగా నున్నందున శాసనములను బరీక్షించిన యిప్పటివా రతఁడు ౧౫౩౦ వ సం

వత్సరమునందే మృతినొందెనని నిశ్చయించి యున్నారు. ౧౫౨౬, ౧౫౨౮, ౧౫౨౯ వ సంవత్సరములయం దచ్యుత దేవరాయల దానశాసనములు సహితము రెండు మూఁడు కానవచ్చుచున్నను, అవి కృష్ణరాయల జీవితకాలములోనే చేయఁబడినవి కావచ్చును.

[కృష్ణదేవరాయల జననకాల నిర్ణయమును గూర్చి ఆంధ్రకవి తరంగిణిలో క్రింది యంశములు వ్రాయఁబడినవి.

"నంది మల్లయ్య, ఘంట సింగయకవులు తమ వరాహ పురాణమును క్రీ. శ. 1485-1490 ప్రాంతమున రచించి కృష్ణరాయల తండ్రియగు నరస రాయల కంకిత మిచ్చియున్నారు. కృతిపతినిగూర్చి చెప్పిన పద్యములలో కృష్ణరాయల అన్నయగు వీర నరసింహరాయల ప్రశంసయే కలదు. కృష్ణ రాయల ప్రస్తావనలేదు. కావున అప్పటికిఁ గృష్ణరాయలు పుట్టియుండక పోవచ్చును. లేదా పుట్టియున్నను అతఁడు మిక్కిలి తక్కువ వయసువాఁడై యుండవచ్చును. కావున శ్రీ కృష్ణరాయలు క్రీ. శ. 1487 ప్రాంతమున జన్మించియుండవచ్చును.

'అందలి శాలివాహన శకాబ్దము'లను పద్యమును అధిక విశ్వాసార్హముగా నెంచవచ్చు' నని శ్రీ వీరేశలింగం పంతులుగారు వ్రాసిరి. కాని అందలి శాలివాహన శకసంఖ్య 1387 మాత్రము వికృతి సంవత్సరముకాదు; పార్థివ యగుచున్నది. వికృతి 1392 అగును. కావున దీనిని బట్టి రాయల జననకాలమును నిర్ణయింప వీలులేదు. రాయలు వైశాఖమాసమున జనించి నట్లు నెల్లూరు శాసనమునఁ గలదు.

గుంటూరు జిల్లా తెనాలిలో, శాలివాహనశకము ౧౪౧౧ సౌమ్య సం॥ వైశాఖ శుద్ధ ౧౧ నాఁడు గోవర్ధనేశుని ప్రతిష్ఠించి వ్రాయఁబడిన శాసన మొకటికలదు. అందు విజయనగర ప్రభువగు కృష్ణరాయలును, మంత్రి తిమ్మరుసును ఆలయమునకు వచ్చి దానములు చేసినట్లున్నది. ఇది సత్యమయ్యెనేని కృష్ణరాయల జననము క్రీ. శ. ౧౪౭౭ కాఁజాలదు. రెండేండ్ల

వయసున రాయలు మంత్రితోవచ్చి దానధర్మములు చేయుట పొసఁగదు. ఈ శాసనపు పూ_ర్తి పాఠము లభించలేదు. గోవర్ధనేశ్వరుని ప్రతిష్ఠకుఁ దర్వాత కొన్నేండ్లు గడచిన పిదప నీ శాసనము పుట్టియుండవచ్చును. శా.శ. ౧౪౧౧ నాఁటికి నరసరాయలే జీవించియుండెను. శాసనము గోవర్ధనేశ్వరుని ప్రతిష్ఠా కాలమును సూచించునదైన కావలెను, లేదా-యీ శాసనము కల్పిత మైనదైనను కావలెను. క్రీ. శ. 1487 లో రాయలు జన్మించుట నిశ్చయ మేని, అతని జన్మదినము కీలక సం. వైశాఖ బహుళ విదియ కావలెను." [చూ.ఆంధ్రకవి తరంగిణి, సం. 7. పుటలు 16-18.]] కృష్ణదేవరాయల తండ్రియైన నరసింహరాయనికి తిప్పాంబ యనియు, నాగమాంబ యనియు, ఇద్దఱు భార్యలు గలరు. ఆ యిరువురలో తిప్పాంబ పట్టపురాణి యనియు, నాగమాంబ భోగకాంత యనియు, చెప్పుదురు. కొన్ని శాసనములయందుఁ గూడ నిట్లే కానఁబడుచున్నది. * ఆ యిద్దఱు భార్యలలో తిప్పాంబకు వీర నరసింహరాయలును, నాగమాంబకు కృష్ణదేవరాయలును పుట్టిరి. నరసింహ దేవరాయల కోబమాంబ యని యింకొక భార్య యున్నట్టును, ఆమె కచ్యుతదేవరాయలు పుత్రుఁడయినట్టును, శాలివాహనశకము ౧౪౫౫ వ సంవత్సరమునకు సరియైన హూణాబ్దము ౧౫౩౩ హేవిళంబి సంవత్సర మున చిత్తూరిమండలములోని నారాయణపురము నొక బ్రాహ్మణునికి దాన మిచ్చుచు నచ్యుత దేవరాయలు వ్రాసి యిచ్చిన తామ్రశాసనములోని యీ క్రింది వాక్యములవలనఁ దెలియవచ్చుచున్నది:-

---

*[ఇయ్యెడ "ఆంధ్రకవి తరంగిణి" లో క్రింది విషయములు వివరింపఁబడినవి

'కృష్ణరాయల తల్లి కులకాంతియేగాని భోగకాంత కాదు. అట్లనుటకుఁదగిన యాధారములు లేవు. ఆమె భోగకాంతియైనట్లు తెల్పుశాసనమొక్కటియును లేదు. వీరనరసింహరాయల శాసనములందును, కృష్ణరాయల శాసనముల యందును గూడ నాగలాదేవి (నాగమాంబ) నరసరాయల భార్యయే యనికలదు. ఆమె భోగకాంతయని యనుమానించుటకును అవకాశములేదు. కావున, ఆమెంగూర్చిన కథలును, వానిననుస రించి కృష్ణరాయలు దాసీపుత్రుఁడని యూహించి, అతని వివాహముంగూర్చి చెప్పఁబడు కథలును కల్పితములని చెప్పవలయును.']

తిప్పాజీ నాగలాదేవ్యోః కౌసల్యా శ్రీసుమిత్రయో
జాతౌ వీరనృసింహేంద్ర కృష్ణరాయ మహీపతీ
అస్మాదోబాంబికా దేవ్యా మచ్యు తేంద్రోపి భూపతిః.

కృష్ణదేవరాయల తండ్రి నరసింహరాజే మధుర, శ్రీరంగపట్టణము మొదలయిన వానిని జయించి తద్దేశముల నాక్రమించినట్లు పారిజాతాపహరణములోని యీ క్రింది పద్యమువలనఁ దేటపడుచున్నది—

సీ. కుంతలేశ్వరుఁడు చిక్కుపడంగ విద్యాపురంబుఁ గైకొని నిజప్రౌఢి నెఱపెఁ
బారసీకునకు దుర్భరమానవత్వంబుఁదొలఁగించె మానవదుర్గసీమఁ
జోళవల్లభునకు సురవధూమధురాధరము లిచ్చి మధురాపురంబు గొనియె
శ్రీరంగపట్టణసీమ ఖడ్గనటీవినోదంబు హావనేంద్రునకుఁ జూపె
నతఁడు నుతికెక్కె రామనేత్వంతరాళ
కలిత షోడశదానవిఖ్యాత యశుఁడు
మండలీకర మేఘమారుతాండబిరుదుఁ
డీశ్వరాధిపు నరసపృథ్వీశ్వరుండు.

౧౪౩౯ వ సంవత్సరమునకు సరియైన శాలివాహనశకము ౧౪౩౦ శుక్ల సంవత్సర వైశాఖమాసమునందు సింహాసనమునకు వచ్చువఱకును గల కృష్ణరాయని చరిత్రము విశ్వాసార్హమైన దేదియు తెలియదు.

[శాలివాహనశకము ౧౪౩౦ వ సంవత్సరము శుక్లనామ సంవత్సర మాఘ శుద్ధ చతుర్దశికి సరియైన క్రీ. శ. 1509 ఫిబ్రవరి 4 వ తేదీని కృష్ణరాయల పట్టాభిషేకము జరిగినట్లు శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణ రావుగారు 'మహమ్మదీయ మహాయుగము' నఁ దెల్పిరనియు, వారు తెల్పిన శుక్ల మాఘ శుద్ధ చతుర్దశి క్రీ. శ. 1510 జనవరి 24 వ తేదీకి సరిపోవుచున్నదనియు, అది శా. శ. ౧౪౩౨ అనియు 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ దెలుపఁబడినది. (సంపుటము. 7 పుటలు 21, 22) శ్రీ నేలటూరి వేంకట

రమణయ్యగారు రాయల పట్టాభిషేక కాలము క్రీ. శ. 1509 ఆగష్టు 7 వ తేదీయని నిర్ణయించియున్నారు. ఆంధ్రకవి తరంగిణీకారులు చాలవఱకుఁ జర్చించి పట్టాభిషేకము శుక్ల సం. మాఘ శు. ౧౪ నాఁడు జరిగెననియు,కాని అన్నయగు వీర నరసింహరాయల యనుమతిపై కృష్ణరాయలు శుక్ల కృష్ణ జయంతినాఁడు (తే 7-8-1509) రాజ్యాధికారము స్వీకరించెనని తలఁపవచ్చు ననియుఁ దెలిపియున్నారు.) (చూ. ఆంధ్రకవి తరంగిణి. సం. 7. పుటలు 22-28.]

వీర నృసింహరాయని పైని జూపు ప్రేమముకంటెఁ దండ్రి కృష్ణ రాయనియెడనధిక ప్రేమమును జూపుచు వచ్చెననియు, అది చూచి సహింప లేక వీర నృసింహరాయని తల్లి తన సపత్నిపుత్రుని జంపింపఁ బ్రయత్నిం పఁగామంత్రియైన తిమ్మరుసు జాడఁ గనిపెట్టి యాతనిని దాఁచి ప్రాణ మునురక్షించి కాపాడె ననియు, తరువాతఁ గొంతకాలమునకు నరసింహదేవ రాయ లుబ్బుజబ్బుచేత బాధపడుచుఁ బ్రాణావసాన కాలమునందుఁ గొడు కులనుబిలిచి తనవ్రేలియుంగరమును దీసికొన్నవాఁడు రాజ్యార్హుఁ డని చెప్పినప్పుడు తక్కినవారు తీయుట కుపాయము తోఁచక యూరకుండగాఁ గృష్ణరాయలు తన చేతి ఖడ్గముతో జనకుని వ్రేలు నఱికి యుంగరమును గైకొనెననియు,అతని సాహసమునకు మెచ్చి తండ్రి యాతనినేపట్టాభిషిక్తుని జేయ నియమించి దేహవియోగమును బొందెననియు కథలు చెప్పుదురు. నరసింహరాయని యనంతరమున జ్యేష్ఠుఁడయిన వీరనృసింహరాయఁడే రాజ్యమునకు వచ్చినట్టు కృష్ణరాయని కంకితము చేయఁబడిన మనుచరిత్రాది గ్రంథములే చెప్పుచున్నందున, ఈ కడపటి సంగతి సత్యమయి యుండదు. కృష్ణదేవరాయఁడు సింహాసనమునకు వచ్చిన శీఘ్ర కాలములోనే యుద్ధ యాత్ర చేసి తన రాజ్యమును నానాముఖముల వ్యాపింపఁజేసెను. దాసీ పుత్రుఁడగుటచేత నాతనికిసత్కులీనులగు రాజులెవ్వరును గన్య నియ్యనం దున సింహాసన మెక్కినప్పటికి వివాహముకాలేదు. కృష్ణరాయలు ౧౫౧౩ వ సంవత్సరమునందు దక్షిణ దిగ్విజయ యాత్రకు బయలువెడలి మహి

సూరు దేశములోని యుమ్మత్తూరు, శివసముద్రము, శ్రీరంగపట్టణము లోఁ బలుచుకొని గంగవంశరాజులను జయింపఁగా, తరువాత మహిసూరు దేశ మంతయు స్వాధీనమయినది. ఈ దేశమును జయించినసంగతి పారిజాతాప హరణములోని ద్వితీయాశ్వాసాంతమందలి యీ క్రింది పద్యమునందు సూచింపఁబడినది.

శా. సమ్మర్దక్షమధీనిబంధనవిధాసంక్రందనాచార్య శూ
రమ్మన్యాచలవజ్రపాత జగతీరక్షాంబుజాక్ష శర
ధ్యమ్మాత్రగ్రస్థదశాస్య రాజ్యసమ సహ్యాద్రిప్రోద్భవాతీరభా
గుమ్మత్తూరి శివంసముద్రపుర వప్రోన్మూలనాడంబరా !

ఆ సంవత్సరమునందే కృష్ణదేవరాయలు నెల్లూరి మండలములోని యుదయ గిరిమీఁదికి దండెత్తి, దాని కధికారిగా నున్న వీరభద్రపాత్రుని పినతండ్రి యైన ప్రహరేశ్వరపాత్రుని జయించి యా దుర్గమును సాధించెను.

అటుతరువాతఁ గృష్ణరాయల మంత్రియైన యప్పాజీ యను నామాంతరము గల తిమ్మరుసు (సాళువ తిమ్మరాజు) నెల్లూరి మండలములోని కనిగిరి (కనకగిరి) కి రాజయినట్టియు, ఓరుగంటి ప్రతాపరుద్రుని సంతతి వారిలోఁ గడపటివాఁడయినట్టియు వీరరుద్రగజపతి కాతని కుమార్తెను కృష్ణదేవరాయల కిచ్చి వివాహము చేయుమని సందేశము పంపెను.*

ఆతడు హీనకులుఁడైన కృష్ణరాయనికిఁ దన పుత్రిక నియ్యనని స్పష్టముగాఁజెప్పి యటువంటి బలవంతునితో విరోధము బెట్టుకొనుటకు సాహసింపఁజాలక, కొమార్తెనిచ్చెదనని చెప్పి రాయలను మంత్రి సహిత ముగా రప్పించి, అంతఃపురము చొచ్చినప్పుడు రాజు ప్రాణములు గొనఁ బ్రయత్నించెను, కోటలోఁ బ్రవేశించిన తరువాత మంత్రియైన తిమ్మరు సీ మోసమును గనిపెట్టి రాజు ప్రాణములు కాపాడుటకై తాను రాజువేష

*[వీర రుద్రగజపతి కటకము రాజధానిగా ఓఢ్రదేశమును, కొంత తెలుఁగు దేశమును పాలించుచుండిన రాజు; కాని ఓరుగంటి కాకతీయుల సంతతివాఁడుకాఁడు. అతని కుమార్తె చిన్నాదేవియును గాదు.]

మును వేసికొని కృష్ణరాయనికి సేవక వేషము వేసితన వెంటఁగొని పోయెను. కాని కృష్ణరాయని చేతి వ్రేలి నున్న ముద్రయుంగరమును బట్టి యతఁడే రాజని యంతఃపురములోనివా రానవాలు పట్టిరి. ప్రాణోపద్రవము సంభవింపనున్న యా సమయమునందు ధీమంతుఁడైన మంత్రియుపాయము వలన రాజు తానును మంత్రియు నెట్లో ప్రాణములు దక్కించుకొని పాఱిపోయి స్వదేశమును జేరినతోడనే సేనలను గూర్చి కవిగిరి మీఁద దండెత్తి వచ్చి వీరరుద్రుని రాజ్యమును, అతని పుత్రికయైన చిన్నాదేవిని గైకొని, ద్రోహియైన యాతనిఁ జంపక కుటుంబసహితముగా వింధ్యపర్వత ప్రాంతములకుఁ బాఱఁద్రోలెను. వీరరుద్రుని శుద్ధాంత స్త్రీలు వింధ్యపర్వతము పాలైన సంగతిని మనుచరిత్రమునం దల్లసాని పెద్దన యీ రీతిగా వర్ణించియున్నాఁడు. :-

మ. ధరకెంధూళులు కృష్ణరాయల చమూధాటీగతి న్వింధ్యగ
హ్వరముల్దూఱఁగఁజూచి తారచటఁగాఁపై యుండుటం జాల న
చ్చెరువై యెత్తని వింతచీఁకటులు వచ్చెం జూడరేయంచు వే
సొరిదింజూతురు వీరరుద్రగజరాట్పుద్ధాంత ముగ్ధాంగనల్.

కృష్ణరాయలు ౧౫౧౫ వ సంవత్సరమునందు పూర్వ దిగ్విజయయాత్ర వెడలి, ఆ సంవత్సరమునందే కొండవీడు, బెల్లముకొండ, బెజవాడ, కొండపల్లి, రాజమహేంద్రవరము మొదలయిన ప్రదేశములను జయించి ౧౫౧౬ వ సంవత్సరమునందు విశాఖపట్టణ మండలములోని భీమునిపట్టణమున కయిదుక్రోసుల దూరములోనున్న పొట్నూరివద్ద, రాతి జయస్తంభమును వేయించి, ఆ మండలములోని వీరవల్లి తాలూకాలోని వడ్డాదిజయించి, ఉత్కరదేశములోని కటకపురము వఱకుఁబోయి కటకపురమును గాల్పగా, కళింగదేశాధిపతియై యోఢ్రదేశమును బాలించుచుండిన ప్రతాపరుద్రదేవుఁడు తన కుమార్తెయైన తిరుమలదేవిని రాజునకిచ్చి వివాహముచేసి సంధిచేసి కొనెను. అందుచేతఁ గృష్ణదేవరాయలు రాజమహేంద్రవరము వఱకునుగల కళింగదేశమును మఱల ప్రతాపరుద్రున కిచ్చివేసి, ౧౫౧౬ వ సంవత్సరాంత

మున కాంచీపురము ప్రవేశించెను. ఈతని ప్రథమ భార్యయైన చిన్నాదేవికి, అన్నపూర్ణాదేవియనియు నామాంతరము గలదు. ఈతనికిఁ దిరుమలదేవియు నన్నపూర్ణాదేవియు నిద్దఱు భార్యలగుటను గృష్ణరాయలు తాను విష్ణు చిత్తీయమునందిట్లు తెలిపియున్నాఁడు.

క. ఆవిభు ననంతరంబ ధ
రావలయముఁబూని తీవు రహిమైఁ దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుగన్.

[ కృష్ణదేవరాయల వివాహముం గూర్చియు, అతని భార్యలం గూర్చియు వారి నామములం గూర్చియు వివిధములగు నభిప్రాయము లున్నవి. రాయలకుఁ బండ్రెండుగురు భార్య లుండినట్లు కొందఱు చెప్పు చున్నారు. వారందఱును భార్యలు కారనియు, కొందఱు భోగకాంతలయి యుందురనియుఁ గొందఱి యభిప్రాయము. అల్లసాని పెద్దన్న రచించిన మనుచరిత్రమును బట్టి రాయలకు 'చిన్నాదేవి', 'తిరుమలదేవి' అను నిర్వురు దేవేరులుండినట్లు తెలియుచున్నది. చిన్నాదేవి రాయల భోగకాంత యనియు, కాని, రాయలామెకు మాట యిచ్చిన ప్రకారము దేవేరితో సమానముగా గౌరవించుచుండెననియు మఱి కొందఱి యభిప్రాయము. కాని కృష్ణదేవరాయలు రచించిన 'ఆముక్తమాల్యద' లో 'తిరుమల్దేవియును నన్నపూర్ణాదేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుగన్' అని యున్నది. దీనింబట్టి యప్పటికి తిరుమల దేవియు, అన్నపూర్ణాదేవియు రాయల దేవేరు లైనట్లు తెలియుచున్నది. చిన్నాదేవి ప్రస్తావనయే లేదు. చిన్నాదేవి నామాంతరమే అన్నపూర్ణాదేవి యని శ్రీవీరేశలింగం పంతులుగారు వ్రాసిరి గాని దానికిఁ దగిన ప్రమాణము లేదని చాలమంది యభిప్రాయము. ఆముక్తమాల్యద రచింపఁబడునాటికి చిన్నాదేవి మరణించి యుండునని "ఆంధ్రకవితరంగిణీకారులు" వ్రాయుచున్నారు. 'తిరుమల్దేవియును, నన్న

పూర్ణాదేవియుఁ గమలాబ్జముఖులు' - అను పద్య భాగముంబట్టి రాయలకు నలుగురు భార్యలనియు, వారు తిరుమలదేవి, అన్నపూర్ణాదేవి, కమలాదేవి, అబ్జముఖీదేవి అనియుఁ, గొందఱి తలంపు. 'కమలాబ్జముఖులు' అనునెడ 'కమలాబ్జముఖియు' అను పాఠమున్నది. అదియే సరియగు పాఠమని గ్రహించి శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారు 'కమలాదేవియు' అను నర్థమును గ్రహించి యున్నారు. దీనింబట్టి ఆముక్త మాల్యదను రచించునప్పటికి రాయలకు ముగ్గురు భార్యలుండినట్లు తెలియుచున్నది. ఈ 'కమలాబ్జముఖి' పదముచే 'లక్ష్మీదేవి' తెలుపఁబడు చున్నదనియు, ఆమె ప్రతాప రుద్రగజపతి కుమార్తెయనియు ఆంధ్ర కవి తరంగిణీ కర్త మున్నగు వారి యాశయము. గజపతి రాజు కుమార్తె నామమును గూర్చి యభిప్రాయ భేదములు కలవు. ఆమె 'తుక్కాదేవి' యని కొందఱును, 'లుఖాదేవి' అని కొందఱును, 'లక్ష్మీదేవి' అని కొందఱును, 'భద్రాదేవి' అని కొందఱును, 'అన్నపూర్ణాదేవి' యని కొందఱును 'మోహనాంగి' అని కొందఱును - ఈ రీతిని వివిధ రీతులఁ దలంచి యున్నారు. శాస నాధారములంబట్టి యామె పేరు 'లక్ష్మీదేవి' యని నిర్ణయింపవలెనని 'ఆంధ్ర కవితరంగిణి' లోఁ జెప్పఁబడినది, (సంపుటము. 7 పుట 46) అన్నపూర్ణాదేవి యే రాజపుత్రికయైనదియు, ఆమె వివాహ మెప్పుడు జరిగినదియుఁ దెలియుట లేదు.]

ఈతఁడు పూర్వదిగ్విజయ యాత్రలో సింహాచలమును దర్శించినప్పుడు భార్యాసహితముగాఁ జేసిన దానమును గూర్చి సింహాచల దేవాలయములో నేఢవ స్తంభముమీఁద జెక్కించిన యీ క్రింది యంశమును విశాఖ పట్టణ మండల చరిత్రమునుండి తీసికొనుచున్నాను.—

"శుభమస్తు శ్రీమన్ మహారాజాధిరాజ పరమేశ్వర మూరు రాయర గండ ఆదిరాయ విజయభాషాగీత ప్రవర రాయరగండ యవనరాజ్య సంస్థాపనాచార్య శ్రీవీరప్రతాపకృష్ణదేవ మహారాజులు

సింహాసనస్థుడై పూర్వ దిగ్విజయ యాత్రకు విచ్చేసి ఉదయగిరి, కొండ వీడు, కొండపల్లి, రాజమహేంద్రవరము మొదలయిన దుర్గాలు సాధించి సింహాద్రికి విచ్చేసి స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు ౧౪౩౭ అగు నేటి ధాత సం॥ చైత్ర బ ౧౨ స్థిరవారాన సింహాద్రినాథు దర్శించి తమ తల్లి నాగాదేవమ్మగారికిన్ని, తమ తండ్రి నరసరాయుని గారికిన్ని పుణ్యముగాను దేవునికి సమర్పించిన కంఠమాల ౧-కి ముత్యాలు ౯౯౧ వజ్రమాణిక్యాల కడియాలజోడు ౧-టి శంఖచక్రాల పతకం ౧-న్ని పయిడి పళ్ళెం ౧ - న్ని తూకాలుగ ౪౪౨౯౨ కాని మాడలుగ ౨౦౦౦ తమ దేవి చిన్నాదేవమ్మగారి చేతను, సమర్పించిన పతకం ౧-కి గ ౫౦౦ తిరుమలదేవమ్మగారి చేతను సమర్పించిన పతకం ౧-కి గ ౫౦౦ యింత మట్టుకు సమర్పించిన ధర్మశాసనము."

కృష్ణదేవరాయల విజయములను గూర్చి పారిజాతాపహరణము నందును, మనుచరిత్రమునందును జెప్పఁబడిన కొన్ని పద్యముల నిం దుదాహరించు చున్నాను :—

చ. మునుకొని కొంఁడవీటి కడ మూఢత రుద్రుఁడు కృష్ణనందను
నృమనసిజునిన్ జయించె; నది మానుషమే? నరనేంద్రు కృష్ణరా
య నృపతి కొండవీటికడ నాహవ భూమిఁ బ్రతాపరుద్ర నం
దను డగు వీరభద్రుఁ గరుణామతిఁ గాచె జగత్ప్రసిద్ధిగన్.

చ. నెలకొని కృష్ణరాయధరణీవిభుఁ డుత్కలభూమిపాలుతోఁ
గలన నెదిర్చి హస్తికరకొండతతు ల్మసకంపుఁ బాములై
మలసినచోటఁ గూడిన సమగ్రయశోవసనంబు గప్పి తా
వలఘఁగఁ జేసె భూపతిని వశ్యవిభిజ్ఞుఁడు గాన నేర్పునన్.

సీ. ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె వినుకొండ మాటమాత్రన హరించెఁ
గూటము ల్పెదరఁగఁ గొండవీ డగలించె బెల్లముకొండ యచ్చెల్లఁ జెఱిచె

వేలుపుకొండ నుద్వృత్తి భంగము సేసె జల్లిపల్లె సమగ్రశక్తిఁ
గూల్చె
గినుకమీఱ ననంతగిరి క్రిందుపడఁజేసె గంబంబుమెట్లు గ్రక్కునఁ గ
దల్చె

బలనికాయము కాలుముట్టల నడంచుఁ
గటకమును నింక ననుచు నుత్కలమహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు. (పారిజాతాపహరణము.)

సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి తీండ్రించు నసిలోహమున
వెచ్చనయి జనించె
మఱి కొండవీ డెక్కి మార్కొని నలియైన యల కసవాపాత్రు
నంటి రాఁజె
నట సాగి జమ్మిలోయఁబడి వేగి దహించెఁ గోనబిట్టేర్చెఁ గొట్టానఁ
దగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె నవుల నాపొట్టూరు
రవులు కొనియె

మాడెములు వ్రేల్చె నొడ్డాది మసియొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగి పఱవఁ
దోఁక చిచ్చన నౌర ! యుద్ధురతఁ గృష్ణ
రాయబాహుప్రతాపజాగ్రన్మహోగ్ని.

చ. అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ నిల్పిన కంబము సింహభూధర
ప్రభు తిరునాళ్ళకుం దిగు సురప్రకరంబు కళింగమేదినీ
విభు నపకీర్తికజ్జలము వేమఱుఁబెట్టి పఠించు నిచ్చలున్.
(మనుచరిత్రము.)

పూర్వదిగ్విజయయాత్ర చేసి వచ్చిన తరువాత మూఁడు సంవత్సరముల వఱకును కృష్ణదేవరాయలు యుద్ధము లేమియుఁ జేసినట్టు కానఁబడదు. అతఁడా కాలమునం దంతటను విద్యావ్యాసంగమునందు ప్రొద్దుపుచ్చుచుండెను. అల్లసాని పెద్దన తన స్వారోచిషమనుచరిత్రమును, నంది తిమ్మన తన పారిజాతాపహరణమును, ౧౫౧౬ వ సంవత్సరమునకు తరువాతను ౧౫౨౦ వ సంవత్సరమునకు లోపలను కృష్ణదేవరాయని కంకితము చేసిరి. ౧౫౧౯ వ సంవత్సరాంతమునందు బీజపుర మహమ్మదీయులతో యుద్ధము చేసి, ౧౫౨౦ వ సంవత్సరమునందు సుల్తానయిన యేదిల్ ఖానుని జయించెను. ఈ యుద్ధవార్త పూర్వోక్తములైన రెండు గ్రంథములయందు నుదహరింపఁబడకపోవుటచేత నవి యీ యుద్ధమునకుఁ బూర్వమునందే రచియింపఁబడినట్టు నిశ్చయింపవలసి యున్నది. అయినను గృష్ణదేవరాయలే తన యాముక్తమాల్యద యందీ యుద్ధవృత్తాంతము నీ క్రింది పద్యముచేఁ జెప్పియున్నాఁడు :—

మ. అలుక స్ఫోటకధట్టికాఖురపుటీహల్య స్థురాసానిపు
　　చ్చలువో దున్ని చలచ్చమూగజమదాసారప్లుతిన్ గీర్తిపు
　　ష్కలసస్యం బిడి యేకధాటి బళిరా ! కట్టించితౌ దృష్టి కే
　　దులఖానోగ్రకపాల మర్దపహరిద్భూజాంగలశ్రేణికిన్.

పయి పద్యమునుబట్టి యాముక్తమాల్యద ౧౫౨౦ వ సంవత్సరమునకుఁ దరువాత రచియింపఁబడినట్లేర్పడుచున్నది. ఓరుగల్లు, గోలకొండ మొదలయిన సంస్థానములను గూడ జయించి, యితఁడు తన రాజ్యమును దక్షిణహిందూస్థానము నందంతటను వ్యాపింపఁజేసెను. ఈ దక్షిణ దేశమును పాలించిన రాజులలో నింత గొప్పరాజ్య మేలిన రాజు మఱి యెవ్వఁడును లేఁడు. ఒడ్డిరాజులయిన గజపతులను, తురుష్కరాజులయిన యశ్వపతులను, తెలుఁగురాజులయిన నరపతులను, జయించుటచేత నీతనికి మూరు రాయరగండఁడని బిరుదు కలిగినది.* ఇటువంటి బిరుదములనేకము

* (శ్రీకృష్ణదేవరాయలు మూఁడిండ్ల తురకలను జయించి మూరురాయరగండాం కుఁడయ్యెనని "ఆంధ్రకవి తరంగిణి.")

చ. అతనికి మేలుహాఁదనయి యాప్తుఁడనై సచివుండనై మహా
హితమతినై సఖుండనయి యెల్లపుడుం బెడఁబాయకుండి సం
తతము మృదూక్తులన్ శివకథాకథనంబులఁ బ్రొద్దుపుచ్చుచున్
గుతుకముతో వసించెద సకుంతితవృత్తిఁ గవు ల్నుతింపఁగన్.

ఈపద్యములవలననే కవి శైవుఁడగుట స్పష్టముమగు చున్నది. ఇతఁడు వసిష్ఠగోత్రుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; సర్వేశ్వరారాధ్య పుత్రుఁడు. ఈకవి తనగ్రంథమునందు "రంగనాథుని రామలింగకవిని సూరపరాజును గౌరనాహ్వయు" నని రామకృష్ణుని స్తుతించుటచేత రామకృష్ణకవికిఁ దరువాతను కూర్మపురాణమునుండి యప్పకవి పద్యము నొకదాని నుదాహరించి యుండుటచేత నప్పకవికిఁ బూర్వమునందును, ఉన్నట్టు తేటపడుచున్నది. అందుచేతఁ గవి హూణశకము ౧౬౩౦ - వ సంవత్సరములయం దున్నట్టు నిశ్చయింపవలసి యున్నది. ఈతనిది మిక్కిలి సరసమైన కవిత్వమని కూర్మపురాణములోని యీక్రింది పద్యములవలననే తెలియవచ్చును—

ఉ. భంబుగదే నఖావళి నభంబుగదే నడుము న్మదద్విరే
భంబుగదే కచంబు దిగిభంబుగదే నడతీరు హేమకుం
భంబుగదే కుచంబు కరభంబుగదే తొడ పూర్ణచంద్రికా
భంబుగదే స్మితం బురుశుభంబుగదే వచనంబు బోటికిన్. [ఆ. ౩.]

చ. దురితవినాశనం బమరదుర్లభ మవ్యయ ముత్తమంబునై
వఱలెడు యోగసంగతి నవశ్యము జ్ఞానము చేకుఱున్మహే
శ్వరుఁడు కనంబడున్ బరమశాంతి యమాదిసమాధియుక్తమౌ
వరశివయోగమార్గమున వర్తిల మోక్షము కల్గుఁ గావునన్. [ఆ.౫.]

ఉ. శాంతులు నీతిపారగులు సభ్యు లహింసకు లప్రమత్తు లా
గంతుకు లాహితాగ్ను లుపకారులు కోవిదు లప్రతిగ్రహుల్
దాంతులు పావనుల్ పరమధార్మికు లాశ్రితు లీశ్వరార్చన
స్వాంతులు సత్యవాదు లనవద్యులు పంక్తికి యోగ్యు లారయన్.

# 59. చిత్రకవి రమణకవి

* ఈకవి సాంబవిలాసమను ప్రబంధమును రచియించి వేంకటేశ్వరుని కంకితముచేసెను. ఇతఁడు ౧౬౩౦ - వ సంవత్సరప్రాంతములందున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇతని తండ్రియైన యనంతకవి రామరాజభూషణ కృతమైన హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు వ్యాఖ్య చేసినందున, అతఁడు పదునేడవ శతాబ్దారంభమునం దుండుట స్పష్టము. సాంబవిలాసములోని పద్యముల నప్పకవి లక్ష్యములనుగాఁ జేకొని యుండుటచేత రమణకవి తప్పక తనసాంబవిలాసమును ౧౬౨౦ - వ సంవత్సరమునకుఁ గొంత కాలము పూర్వమే చేసియుండవలెను. కవి తన్నుద్దేశించి యీక్రింది వాక్యములను తనపుస్తకములోఁ జెప్పుకొన్నాడు.—

ఉ. ఓ రమణాఖ్య ! సత్కవికులోత్తమ ! మామకమంజులాహ్వయ
శ్రీరమణీయ ! నీ విపుడు చేయఁగఖూనిన సాంబలక్షణా
సారసదృగ్వివాహకథ సన్మతి మా కిపు డంకితంబుగాఁ
గూరుపు నీకుఁ గల్గు జయగుర్వచలాయురభీష్టవస్తువుల్.

సీ. సర్వలక్షణసారసంగ్రహం బొనరించి
తనరె మీతాత పెద్దనకవీంద్రుఁ
డల హరిశ్చంద్రనలాధీశ సత్కథా
శ్లేషసత్కృతికిఁ బ్రసిద్ధిగాఁగఁ
గవిహితుండౌచు వ్యాఖ్యానంబు నొనరించి
మరియు నిందుమతీసుపరిణయంబు
మొదలైన సత్కావ్యములు చేసి రహి గాంచె
నరయ మీ తండ్రి యనంతసుకవి
చిత్రకవిమంజులాన్వయక్షీరవార్ధి
చంద్రమూర్తివి సద్బుద్ధిశాలి వీవు

* [ఈతఁడు ప్రథమశాఖా బ్రాహ్మణుఁడు. ఈతని పేరు వేంకటేశ్వరుఁడనియు, వేంకటరమణ కవియని ప్రసిద్ధి యనియు సాంబవిలాస గద్యవలనఁ దెలియుచున్నది.]

రమణసత్కృపి ! నీవొనర్పంగఁబూను
కృతవతంసంబు నతని కంకిత మొనర్పు.

సాంబవిలాసమునందు దుర్యోధనపుత్రియైన లక్ష్మణాకన్యను కృష్ణుని కొడుకైన సాంబుని కిచ్చి వివాహము చేసిన కథ చెప్పఁబడినది. ఇది సలక్షణమైన గ్రంథము. ఇందుండి రెండు మూఁడు పద్యముల నిం దుదాహరించుచున్నాను.

చ. కొడవలిచేత బొడ్డు తగఁగోసి గడానిపసిండి చేటలో
నిడి నులివెచ్చనీట నొడ లెంతయు నారిచి మేలిచల్వపా
వడఁ దడి యొత్తి ఫాలమున బాగుగ నున్నని కాపుదృష్టి బొ
ట్టిడి రహి దీవన ల్సలిపి హెచ్చుగ నారతు లిచ్చి క్రచ్చఱన్. [ఆ.౧]

ఉ. జాంబవతీతనూజుఁ డల సాంబుఁడు బాల్యమునందు మందహా
సం బను భవ్యచంద్రిక నజస్రము మాతృమనోంబుజాతహా
ర్షాంబుధిఁ బొంగఁజేయుచు నుదంచితనై జకుమారచంద్రభా
వంబు యథార్థమై తనర వర్తిలు సత్కళల జెలంగుచున్. [ఆ, ౧.]

మ. ఒక భిల్లాగ్రణి వెంబడించి తనపై నుత్సాహ మొప్పంగ వ
చ్చు కఠోరాధిక గర్వదూర్వహతరక్షు శ్రేష్ఠమున్ సాంబభూ
పకరీంద్రంబు నుతింప మేలితళుకుం బల్వాడియందంపునుం
జికటారిం బడఁగూల్చి యార్చుటు లొనర్చెం బేర్చి శౌర్యంబునన్ [ఆ.౧]

ఈకవి భారద్వాజగోత్రుఁడు; కాత్యాయనసూత్రుఁడు; ఓబళాంబా పుత్రుఁడు. ఇతనిచే రచింపఁబడిన రామాయణ మొకటిగూడఁ గానఁబడుచున్నది. దాని కితఁడు "విద్వత్కవికర్ణ రసాయన సకలవర్ణనాపూర్ణ రామాయణము" అని పేరు పెట్టెను. ఈరామాయణములోని గద్యమునుబట్టి కవి యభిమన్యువిలాసము, గుమారగురువిలాసము లోనగు గ్రంథములను గూడ రచించినట్లు తెలియవచ్చుచున్నది. ఈ రామాయణములోనివి ప్రతికాండము నుండియు రెండేసి పద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. బిరుదులజల్లులున్ బునుఁగుఁబిల్లులపిల్లలు నుల్లసద్గతిం
బరఁగెడు మేలిమూలికలవల్లులు వీక్షణపర్వకారిబం
ధురమృగరాణ్మతల్లులు వినూత్నతరంబులు కొల్లలై తగన్
సరవిని గాన్కలిచ్చి మహిజానికి నిట్లని రందఱుం దగన్.

[బాలకాండము]

శా. దేహం బస్థిర మెల్లవారలకు ధాత్రీభాగమం దేల యి
ట్లూహాపోహలు చేయ నీతనికి మున్నుత్సాహియై యిత్తునం
చాహా! పల్కితి వి ప్రబద్ధములు పెక్కాడంగ యుక్తంబులౌ
నా? హేయాంగము దీని నమ్మి యిటు లేలా దబ్బఱ ల్పల్కఁగన్.

[బాలకాండము]

మ. భరతుం డెవ్వఁడు కైక యెవ్వతె ధరాపాలుండు తా నేమి? త
ద్వరయుగ్మం బన నేది నానిశితతీవ్రస్ఫారఖడ్గంబుచే
భరతుం ద్రుంచి ధరాస్థలంబునకు నిన్ బట్టంబు నేఁ గట్టెదన్
ధరణీమండలి నెల్లమానవులు మోదం బూని కీర్తింపఁగన్.

[అయోధ్యాకాండము]

మ. నిను మన్నించి మదాత్మజున్ రఘువరున్ నే నిట్లు కోల్పోయితిన్
నినుఁ భెండ్లాడి సమస్త భూమిజనము ల్నీచాత్మఁ డీతం డనం
గ వేలంబగు నింద వర్తిలితిఁ గైకా! సూర్యవంశంబు నీ
దునిమిత్తంబు నెన్నిభంగులఁ జెడెన్ దోషంబు నిన్ జూడఁగన్.

[అయోధ్యాకాండము]

ఉ. ఉత్తములైన రాజవదు లుద్ధురబాణకృపాణచాపముల్
హత్తి ధరించు టెల్ల సభయాత్మకులై శరణన్న వారి ను
ద్యత్తరలీలఁ గావఁగ రణాంగణమం దెదిరించినట్టి యు
న్మత్తరిపుప్రకాండముల మర్దనచేయఁగఁ గాదె యెన్నఁగన్.

[అరణ్యకాండము]

ఉ. ఆచెలువంపుజొక్కపుటొయారము లాజిగిప్రాయ మాఘన
శ్రీచణరూప మాతళుకుఁజెక్కులచక్కఁదనంబు లామహా
ధీచతురత్వ మాపలుకుఁదేనియ లాగమనంబు లావిభా
ప్రాచురి యెక్కడం గనుట పల్కుట వింటయు లేదు రావణా!

[అరణ్యకాండము]

శా. నీకున్ శత్రుఁడఁ గా భవద్రిపులతో నే సఖ్యముం జేయ నే
జోక న్నీకపకారిగా నకట! యిచ్చోఁ జాల నిర్హేతుకం
బై కన్నట్టి రుష న్నను న్నిశితతీవ్రామోఘబాణంబుచే
వే కూల్పంగ నిమిత్త మేమి? యిది దోర్వీర్యంబె? శ్రీరాఘవా!

[కిష్కింధాకాండము]

ఉ. అంగదుఁ గాంచి యోతనయ! యాత్మ వగం దురపిల్లఁ బోకు ని
న్నుం గడు నాదుమాఱుగఁ గనుంగొను నీరవిపుత్రుఁ డిమ్మహో
త్తుంగభుజప్రతాపనిధితో నెడఁబాయక యుండినన్ జయా
భంగురభోగభాగ్యములఁ బ్రస్తుతి కెక్కి రహింతు వన్నిఁటన్.

[కిష్కింధాకాండము]

ఉ. బంగరుమేలినిగ్గు గల పర్వతమో యన నై జగాత్ర ము
త్తుంగము గాఁగఁ బెంచి మఱి తోడనె పాళము లెల్ల నూడ్చి సా
రంగపరంపరం గదుము రాజితసాహసనింహమో యనన్
బొంగుచు వెంటవచ్చు దితిపుత్రులఁ బోవఁగఁదోలి రోషియై.

[సుందరకాండము]

ఉ. రామకరాగ్రముద్రిక ధరాసుతచేతి కొసంగి రాఘవ
క్షేమము తెల్పి యా జనని కేవలశోకము మాన్పి లంక వా
లామితహవ్యభుక్శిఖల నంతయు దగ్ధము చేసి సీతచూ
డామణిఁ గొంచు వచ్చితిఁ దటాలున నిప్పు డటంచుఁ బల్కినన్.

[సుందరకాండము]

శా. కామాదుల్గడు నీమదిం బెనగొనంగా నాదు సీతీరిత
శ్రీమద్వాక్యము నీకుఁ బథ్య మగునే? శ్రీరామభీమాగ్నికీ
లామేయాంబకరాజి నీతలలు నుగ్గాడంగ నావేళలన్
నామాట ల్మది నీకుఁ బథ్య మగు నన్నన్ రావణుం డుగ్రుఁడై.

[యుద్ధకాండము]

ఉ. సర్వసురౌఘముల్ నను భుజాబలము ల్విడనాడి కొల్చు టా
సర్వవిదుండు విష్ణుఁడు నిజంబుగ నాతఁ డెఱుంగఁడే మహా
గర్వితవిష్ణుఁ డొక్కరుఁడె కాఁ డల బ్రహ్మ యెదిర్చె నేని నే
నోర్వక యుగ్రబాణముల కొక్కట నాహుతి చేసి వ్రేల్చెదన్.

[యుద్ధకాండము]

---

## 60. అందుగుల వెంకయ్య

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; అందుగుల సూరన్నకొమారుఁడు. ఈకవి కృష్ణదేవరాయల యల్లుఁడయిన రామరాజుతమ్ముఁడగు తిరుమలదేవరాయని మనుమని మనుమఁ డగు కోదండరామరాజు కాలములో నుండి యాతనిపేర రామరాజీయ మను నామాంతరముగల నరపతివిజయమను గ్రంథమును జేసెను. * [ ఇయ్యెడ 'ఆంధ్రకవి తరంగిణి'లో నిట్లున్నది— 'తిరుమల దేవరాయని మనుమని మనుమఁడు నరపతి విజయమున వర్ణింపఁ బడలేదు.' (సం. 11. పుట. 206) ] ఈగ్రంథమునందు రామరాజు పూర్వు లయిన నరపతుల చరిత్రమును విశేషముగా రామరాజుయొక్క చరిత్రమును జెప్పఁబడి యున్నది. రామరాజు ౧౫౬౫-వ సంవత్సరమున తాళికోట యుద్ధములో మహమ్మదీయులచేతఁ జయింపఁబడెను. తదనంతరము మూఁడు తరములు గడచిన తరువాత నీగ్రంథము రచియింపఁబడినదగుట చేత, ఇది ౧౬౫౦-వ సంవత్సరప్రాంతమున రచియింపఁబడినట్టు చెప్ప

*[ఇతఁడు రామరాయల మనుమని మనుమఁడని 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ జెప్పఁబడినది.]

వచ్చును. రామరాజు గుత్తి, పెనుగొండ, గండికోట, కందనూలు, ఆదవేని మొదలయిన ప్రదేశములు గెలిచిన ట్లీక్రింది పద్యమునఁ జెప్పఁబడినది—

గీ. సకలవిభు తిమ్మరాజు సేనలను ద్రుంచి
గుత్తి పెనుగొండ మఱి గండికోట కంద
నూలుపుర మాదవే నవలీల గెలిచి
తొలుఁదొలుత రామనృపతి దోర్బలము మెఱసి.

ఈపుస్తకమునం దీరామరాజు నిజామువలన నహమదాబాదు గొనుట మొదలయిన మహమ్మదీయులతోడి యుద్ధములు కొన్ని వర్ణింపఁబడి నవి. ఈరామరాజు పేరునకు సదాశివదేవరాయని మంత్రియని వ్యవహ రింపఁబడినను, సింహాసనమునకు వచ్చినపుడు సదాశివ రాయలు బాలుఁడగుట చేతను కర్ణాటక రాజ్యము నచ్యుతదేవరాయల యనంతరమున నాక్రమించుకొన్న సలకము తిమ్మరాజును బాఱఁదోలి సదాశివదేవరాయల రాజ్యమును స్థాపించినవాఁ డగుటచేతను క్రీస్తుశకము ౧౫౪౨-వ సంవత్స రము మొదలుకొని ౧౫౬౪-వ సంవత్సరము వఱకును నితఁడే రాజ్యపరి పాలనము చేసెను. ఇతఁడు సలకము తిమ్మయను గెలిచిన కథను సూచించు నితని ప్రతాపము నరపతివిజయమునం దీక్రింది రీతిని వర్ణింపఁబడినది—

చ. ఎలమిని రామరాజవసుధేశుప్రతాప మహార్యమై మహిన్
జెలువుగ నిండఁబర్వి శశిశేఖరదివ్యమహాశితాశుగ
జ్వలనశిఖాసముత్కరముచందము నందమునొందె నెంతయున్
సలకము తిమ్మయప్రముఖశత్రుపురంబుల నెల్ల నారయన్.

ఈరామరాజుతండ్రియైన శ్రీరంగరాజు కృష్ణదేవరాయల తండ్రియైన నృసింహరాజునకు కర్ణాటకరాజ్యమును నిలుపుటలో సహాయుఁడుగా నుండి నట్లు కానఁబడుచున్నది. ఈ శ్రీరంగరాజుయొక్క శౌర్యము నరపతివిజయ ములో నీక్రింది పద్యమున వర్ణింపఁబడినది—

సీ. కడు విజాపురవరకామినీగర్భముల్ భేదించు నెవ్వని భేరివరము
దామిడిఁ బోయి నిజాముపట్టణముల ధూళిగాఁజేయు నేదొరబలంబు
గోలకొండవజీర్ల కోటులకాయముల్ చించు నేరాజేంద్రుచేతికత్తి
సకలభూపాలకాస్థానసన్నుతిఁ గాంచి వెలయు నేశూరుని విజయలక్ష్మి

యతఁడు కేవలనృపతియే యఘవిదూర
చర్యఁ డాశ్రితరక్షావిచక్షణుండు
జీర్ణకర్ణాటభూపునర్జీవనుండు
రమ్యగుణశాలి శ్రీరంగరాయమౌళి.

[ఈవిషయమున 'ఆంధ్రకవితరంగిణి (సం. 11 పుట 205) యిట్లు చెప్పుచున్నది- 'ఈపద్యమున వర్ణింపఁబడిన శ్రీరంగరాజు తిరుమలరాయల రెండవ కుమారుఁడైన శ్రీరంగరాజు, కాని అళియ రామరాజు తండ్రియైన శ్రీరంగ రాజుకాఁడు. ఈ శ్రీరంగరాయల ప్రతాపమును రామరాజ భూషణుఁడుకూడ వసుచరిత్రమున నాలు పద్యములలో వర్ణించి యున్నాఁడు. అళియ రామరాజు మరణముతో శిథిలమైపోయిన కర్ణాటరాజ్యమును పునరుద్ధరించుటలోఁ దండ్రియైన తిరుమల రాయలకు సాహాయ్యము చేయుచుఁ దన శౌర్యమును ప్రకటించినవాఁ డగుటచే నీశ్రీరంగరాయలను వెంకయ్యకవి నరపతి విజయమున 'జీర్ణకర్ణాటభూపునర్జీవనుండు, అని కీర్తించి యున్నాఁడు.'

'అళియ రామరాజు తళ్లికోట యుద్ధమున చనిపోవునాటి కరువదియేండ్లవాఁ డందుమేని, యప్పటి కాతని మనుమఁడైన చినవెంకటరాజు పదేండ్లవాఁడని యూహింపవచ్చును. అతని మనుమఁడైన కోదండరామరాజు యుక్తవయసు వచ్చి కృతినొందు కాలము క్రీ.శ. 1630 ప్రాంతమై యుండునని తలంప వలసి యున్నది. కావున రామరాజీయకృతి రచనాకాలము 1630 ప్రాంతమని నిర్ణయింతము (సం. 11. పుటలు 207, 208.)'

ఈనరపతివిజయము కవిత్వముకంటెఁ జరిత్రమును జెప్పుటయందెక్కువ ప్రసిద్ధమైనదైనను, కవిత్వముకూడ రసహీన మయినది కాదు. కవిత్వరీతిని దెలుపుటకయి రామరాజీయములోని రెండు పద్యముల నిందుదాహరించు చున్నాను —

ఉ. ఇమ్మహి సోమదేవమనుజేంద్రుప్రతాపము నిండి దిక్కులం
బమ్మినఁ జూతపోతనవపల్లవబింబఫలారుణాంబుజా
తమ్ము లటంచుఁ గోకిలకదంబము కీరచయంబు చంచరీ
కమ్ములు క్రమ్మిచుండు నొడికంబుగ భ్రాంతి వహించి పల్మఱున్.

చ. అతివిభవంబునన్ దితిసుతాహితరాజు మహాపరాక్రమో
న్నతి మృగరాజు సోయగమున న్నలరాజు సమస్త ధర్మప
ద్ధతి నల ధర్మరాజ పటుధైర్యమునన్ గిరిరాజు వాక్ప్రశ
స్తత ఫణిరాజు నిర్దళితశాత్రవరా జగు బుక్కరాజిలన్.

---

## 61. కాకునూరి అప్పకవి

ఇతఁడు వైదిక బ్రాహ్మణుఁడు, పదునేడవ శతాబ్దమధ్యమునందుండిన లక్షణవేత్త. ఈకవి యాంధ్రశబ్దచింతామణి యను పేరితో సాధారణముగా నప్పకవీయ మని వాడఁబడెడు లక్షణగ్రంథమును పద్య కావ్యమునుగా రచించెను. ఇతఁ డెనిమిదాశ్వాసముల గ్రంథమును జేయునట్లు ప్రతిజ్ఞ చేసినను, అయిదాశ్వాసములు మాత్రమే యెల్లయెడలఁ గానఁబడుచున్నవి. తక్కిన యాశ్వాసములు చేయకమునుపే యితఁడు మృతినొంది యుండ వచ్చును. ఈ యప్పకవీయమునందు ఛందోవిషయము సమగ్రముగా నున్నను, వ్యాకరణవిషయ మత్యల్పముగా నున్నది.ఇప్పు డున్నభాగములో సంజ్ఞా సంధి పరిచ్ఛేదములు మాత్రమే తెనిఁగింపఁబడినవి. ఇతడు బహు గ్రంథములు శోధించినవాఁడే యయి పూర్వగ్రంథములనుండి యితఁ

డుదాహరించిన పద్యము లన్నియు దాదాపుగా లింగమగుంట తిమ్మన్న మొదలయినవా రీతనికి ముందుచేసిన లక్షణగ్రంథములలోఁ గానఁబడు చున్నవి. ఇతఁడు తనకాలపువారయిన కవులగ్రంథములనుండి విశేషముగాఁ బద్యములను జేకొనియున్నాఁడు. ప్రక్రియాకౌముదియు, నాంధ్రశబ్ద చింతామణియు నని నామాంతరములు గల నన్నయభట్టీయమును బాలసరస్వతి కాలమువఱకు నెవ్వరు నెఱుఁగరు. అది నన్నయభట్టారకవిరచితమనియు, వేములవాడ భీమకవి దానిని గోదావరిలోఁ గలుపఁగా నేనూఱుసంవత్సరము లయిన తరువాత సారంగధరుఁడు దానిని దెచ్చి బాలసరస్వతి కిచ్చెననియు అప్పకవి కలగనెనఁట ! అటుతరువాత నొక బ్రాహ్మణుఁడు దానిని తనకుఁ దెచ్చి యీయఁగా తెనిఁగింప నారంభించెనఁట ! ఈగ్రంథారంభమునకుఁ బూర్వమునం దప్పకవి యేదో తెలుఁగున ఘనకావ్యము చేయ సంకల్పము పూనిన ట్లీక్రింది పద్యములవలన దెలియవచ్చుచున్నది—

క. అని యిష్టదేవతాస్తుతి
యును సకలకవీంద్రుల నుతియును గురునతియున్
వినయమున సలిపి తెలుఁగున
ఘనకావ్యం బొకటి సేయఁగాఁ దలఁచుతఱిన్.

సీ. ధాత రెండవపరార్థమున నాదిదినంబుపగట వరాహకల్పంబునందు
మహితమై వస్వతమనువేళ దేశంబు లర్థింపనైన మహాయుగమునఁ
గలిసమయంబున దొలిచరణంబున మానితంబగు చాంద్రమాసమునను
శాలివాహనశకమున గజ శైల శర సుధాకిరణుల సంఖ్యనడవ

నంగజాబ్దంబునను దక్షిణాయనమున జలధరర్తువు మొదటి మాసంబునందు
బహుళమున దేవకికిఁ జక్రపాణి పుట్టి నట్టి యష్టమి చనుదేర నధికభక్తి.

* * * *

క. కల్పోక్తమార్గమున సం। కల్పము గావించి గోపికావిభుపూజల్
సల్పి మది నతనిపదములు। నిల్పి పురాణార్థగోష్ఠి నిశ గడపునెడన్,

గీ. నుదుటఁ గస్తూరి తిలకంబు పొదలువాఁడు
తలఁచి చూచిన నాకులదైవ మగుచుఁ
బొలుచు నాకులదైవంబుఁ బోలువాడు
నిలిచె నొకరుఁడు నాదుముంగలను గలను.

ఇష్టదేవతానందనాదులను గురుదేవతాస్తుతియుఁ జేసి తెనుఁగున ఘనకావ్య మొకటి చేయ నుద్యమించి శాలివాహనశకము ౧౫౭౭ వ దగు మన్మథ నామ సంవత్సర శ్రావణ బహుళాష్టమినాఁడు సంకల్పముచేసి కామెపల్లె దేవాలయములో రాత్రి పురాణగోష్ఠిని గడుపుచుండఁగా శ్రీకృష్ణుఁడు కలలో వచ్చి యాంధ్రశబ్దచింతామణి నశించిన కథ చెప్పి—

చ. రమణను సత్కవీంద్రులు పురాణచయం బితిహాసపంక్తి కా
వ్యములును దొల్లియైన నిపుడైనను ముంగలనైన దీని సూ
త్రములను దక్క వేఱొకవిధంబున నాంధ్రము చేయఁజాలమిన్
క్షమఁ దెనిగింపు; దీన నవి సర్వముఁ జేయు ఫలంబు నీ కగున్.

దానిని తెనిఁగింప నానతిచ్చెనఁట ; శ్రీకృష్ణుడు స్వప్నదర్శన మిచ్చుటకుఁ బూర్వ మేగ్రంథమును జేయ సంకల్పించెనో చెప్పలేదు. ప్రక్రియాకౌముది యనఁబడెడి యీయాంధ్రశబ్దచింతామణి బాలసరస్వతికృత మనియు దానికి గౌరవము కలుగుటకయి యీకథ కల్పింపఁబడినదనియు నే నీవఱకే చూపి యున్నాను. పయిపద్యములనుబట్టి యీపుస్తకము శాలివాహన శకము ౧౫౭౭ - వ సంవత్సరమునందనఁగా క్రీస్తుశకము ౧౬౫౫ వ సంవత్సరమునం దారంభింపఁబడి ౧౬౫౫ వ సంవత్సరప్రాంతమున కింత వఱకుఁ జేయఁబడి యుండును. అప్పటి కప్పకవి కవసానకాలము తటస్థించి నందున గ్రంథము సమాప్తినొంది యుండక పోవచ్చును.

సీ. జగతి నాపస్తంబశాఖోక్తషట్కర్మపద్ధతిఖండనిబంధనంబు
బాలబాలార్ణవాఖ్యజ్యోతిషగ్రంథసంహితాసుశ్లోకసంగ్రహంబు

శ్రీమదనంతప్రసిద్ధమహావ్రతకల్పకథాంధ్రోక్తి కావ్యరచన
శ్రీనగాధీశసుశ్లేషనిందాస్తుతిభావగర్భితసీసపద్యశతము
లలితకవికల్పకాఖ్యానలక్షణంబు। మహితసాధ్వీజనౌఘధర్మద్విపదము
నంబికావాదనామకయక్షగాన। కృతియుఁజేసితిఁ గాకునూరికులయప్ప.

అను పద్యమువలన నప్పకవి యీ గ్రంథమును రచించుటకుఁ బూర్వము కొన్ని సంస్కృతాంధ్ర గ్రంథములను రచించినట్లు తెలియవచ్చుచున్నది గాని యిప్పు డాగ్రంథములు లభించుట యరుదు. ఈతని కవిత్వము సుగమమైన మృదుమధుర పాకముగలదిగా నున్నది. అప్పకవికిఁ బూర్వమునందు రకార ఱకారములకు యతిప్రాసమైత్రి కలదు లేదను నభిప్రాయభేద మున్నను, "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్" అన్నది బాలసరస్వతి సూత్ర మనుకోక వాగనుశాసనసూత్రమని భ్రమపడి—

గీ. చెల్లునని మున్ను భీమన చెప్పెననుచుఁ
గలుపుదురు రేఫములు ఱకారములును
దుష్టకవు లవి యొకటైనఁ దొంటిపెద్ద
లందఱును నేల విభజింతు రని తెలియర.

అని రేఫఱకారములకు యతిప్రాసమైత్రి కూర్చువారు దుష్టకవులని యప్పకవి దూషించి యున్నాఁడు. రకారద్వయమైత్రిని నిషేధించిన బాలసరస్వతియే తద్భేదము గ్రహింపలేక చంద్రికాపరిణయములోని యీ క్రింది పద్యమునందు రేఫఱకారములకు విశ్రమము కూర్చినాఁడని కూచిమంచి తిమ్మకవి వ్రాసియున్నాఁడు—

ఉ. అక్కమలేక్షణ న్వినయంబుగఁ గాంచుము నాదుమాఱుగా
మ్రొక్కుము సేమమా భువనమోహిని నీకనిపల్కు మార్తిచేఁ
జిక్కితి వేగఁబ్రోవుమని చెప్పుము పొమ్మిఁకఁ దేఁటిరాయ! నీ
ఠెక్కులమాటున న్నను భరించి లభింపుము కీర్తిపుణ్యముల్—
[చంద్రికాపరిణయము]

రేఫరకారమైత్రికి సమ్మతింపనివారని రెండును నేకాక్షరమేయందురా? భిన్నాక్షరము లందురా? ఏకాక్షరమే యయి లఘ్వలఘు రూపములు మాత్రమే యయినయెడల, యలవల లఘ్వలఘు రూపములకువలెనే వీనికిఁ గూడ మైత్రి యేల యుండరాదు? భిన్నాక్షరము లనెడు పక్షమున, రయోస్తు నిత్యం స్యాత్తనుచోట నేకశేషవృత్తి యెట్లు కుదురును? అవి యొకటైనఁ, దొంటిపెద్దలేల విభజింతురని యప్పకవి యడిగిన ప్రశ్నమునకు యలవల నేలవిభజించిరో, యాహేతువుచేతనేయని చెప్పటయే తగిన యుత్తరమగును. [అప్పకవి వంశపుఁ బూర్వుఁడు సోమయ్య వేదశాస్త్ర పురాణాదివాదములను 'కా' కునూఱింటఁజేసిన కారణమున 'కాకునూఱింటివా' రని ఘనతఁ గాంచెనని అప్పకవీయము పీఠిక యందలి 72 వ పద్యమును బట్టి తెలియుచున్నది. కాని, దాని తర్వాతి పద్యములో సోమయ్య అప్ప కవి తాతకుఁ దాత చరిగొండ సీమలో కాకునూరను సర్వాగ్రహారమును సంపాదించెనని చెప్పఁబడినది. సోమయ్యతండ్రి, కాకునూరి తమ్మన్న యనుటచేఁ గాకునూరను నది గ్రామమునుబట్టి వచ్చిన యింటిపేరేగాని పౌరుషనామము కాదని స్పష్టపడుచున్నది. పూర్వమున నుండిన నామమునే తరువాతివారు తమవంశగౌరవప్రకటన కొఱకు విచిత్రముగా వ్యుత్పత్త్యర్థ మును కల్పించి యుండవచ్చును.

సోమయ్య 'అభినవచూతవద్గ్రామము' లో నుండినట్లప్పకవీయములోఁ గలదు. ఆ గ్రామము 'క్రొత్తమామిడిపల్లె' అయి యుండవచ్చును. అప్ప కవి కామెపల్లిలో నుండగా నతనికి స్వప్నము కలిగినట్లును, దానిని మాతృ బంధువులు వినినట్లును గ్రంథమునఁగలదు. ఇది యాతని మాతామహుల యూరు కావలెను. అప్పకవీయమునుబట్టి కామెపల్లి కొండవీటికిఁ బడమటను శ్రీశైలమున కీశాన్యదిశనుగల తంగెటిసీమలో నుండినదని పీఠికలోని 73-వ పద్యమునుబట్టి తెలియుచున్నది. కామెపల్లి గుంటూరుజిల్లాలోని పల్నాడు

తాలూకాలో నున్నదని శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు తెలిపి యున్నారు. అప్పకవి పేర్కొనిన కామెపల్లి యిప్పుడు లేదని శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారి యభిప్రాయము.

అప్పకవిది పండితవంశము. అతని తాతకుఁ దాతయగు సోమయ్య కాశిలో బ్రహ్మేంద్రులవద్ద శాస్త్రముల నభ్యసించెను. తాతయగు పెద సోమయ్య క్రతువులొనర్చెను. తండ్రియగు వెంగన తన పాండిత్యవిశేషముచే 'మారట బ్రహ్మ' యని పేరుపొందెను. అప్పకవి చాలమంది గురువుల వద్ద విద్యల నభ్యసించెను. ఇతనికి మూర్తి సర్వన్న సస్వరముగ వేదము చెప్పెను; కాండూరి గిరిదేశికులు శబ్దశాస్త్రమును బోధించిరి. సూరభట్టు సిద్ధాంతమును తెల్పెను. మంచికంటి ఓజకవి లక్షణముఁదెల్పెను. కోలచలమల సింగనార్యుఁడు స్మార్తధర్మములఁ దెలిపెను. ఆగమములను రాజయోగి బోధించెను. మఱియు, అప్పకవీయమును రచించునప్పటికే యితఁడు శ్రీశైలమున "భోగివిభూషణు" ని పట్టపుఁ గవీంద్రుఁడై యుండెనఁట ఈభోగివిభూషణుఁడు శ్రీమల్లికార్జునస్వామియేగాన మానవమాత్రుఁడై యుండఁడు. దీనింబట్టి యప్పకవి కొంతకాలము శ్రీశైలమున నివసించె నని యూహింపవచ్చును.

అప్పకవి సంస్కృతమున 'ఆపస్తంబషట్కర్త నిబంధనము' ను, 'కాలబాలార్ణవము' నకు శ్లోకరూపమగు సంగ్రహమును రచించెను. ఆంధ్రమున అనంతవ్రతకథ, శ్రీశైల మల్లికార్జునునిమీఁద శ్లేషనిందాస్తుతిగర్భిత సీసపద్య శతకము, కవికల్పకమను లక్షణగ్రంథము, స్త్రీలకు ధర్మద్విపద, అంబికావాదమను యక్షగానము అను గ్రంథములనుకూడ రచించెను. ఈ గ్రంథములు లభింపలేదు.

అప్పకవీయము నందలి మైదాశ్వాసములు మాత్రమే యింతవఱకును లభించినవి, కవి దీని నెనిమిదాశ్వాసముల గ్రంథముగా రచింప సంకల్పించినట్లు తెల్పినాఁడు. కాని సమగ్రముగ వ్రాసినట్లు తోఁచదు.

ఇతఁడు చతుర్థాశ్వాసము చివఱ గర్భకవిత్వమునుగూర్చి వ్రాయుచు— ఒక్కొక్క ఆశ్వాసాంత పద్యమును గూర్చియుఁ దెల్పుచు – 'ఇది భాషా పరిచ్ఛేదమునఁ దెలియవ్రాసినది; ఇది వర్ణపరిచ్ఛేదములోఁ దెలియఁజేయఁ బడియె; ఇది వళిప్రాస పరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె; ఇది యీపద్యపరిచ్ఛేదము తుదను దెలిపెదము; ఇది సంధిపరిచ్ఛేదములోఁ దెలిపెదము' అని వివరించుచుఁ దత్సమ, దేశ్య, క్రియా పరిచ్ఛేదముల తుదను జెప్పవలసిన పద్యములను గూర్చి చెప్పకపోవుటచేఁ జతుర్థాశ్వాసము వ్రాయుసరికిఁ గవికిఁ బంచమాశ్వాసము వ్రాయు నాలోచనమేగాని, తక్కిన మూఁడాశ్వాసములను వ్రాయు నాలోచనమున్నట్లు కన్పింపదు. ఈ విషయము కవి ప్రతిజ్ఞకుఁ గొంత విరుద్ధముగాఁ గన్పించుచున్నది. శ్రీ వీరేశలింగము పంతులుగారు తలఁచినట్లు గ్రంథము పూర్తికాకపూర్వమే కవి కవసానదశ ప్రాప్తించి యుండవచ్చును.

అప్పకవి నిజామురాష్ట్రములోని లేమావిళ్ల నివాసియని శ్రీ దూర్గుల రామకృష్ణారావుగారు పరిశోధన పూర్వకముగ నిర్ణయించిరి. 'అభినవ చూత వర్గ్రామ' పదము దీనికి సరిపోవుచున్నది. లేమావిళ్ల గ్రామము మహబూబు నగరము జిల్లాలోని నాగర కర్నూలు తాలూకాలో నున్నది.]

---

# అ ను బం ధ ము

## పెదపాటి జగన్నాథకవి

ఈతనికి జగ్గకవి యనియు, రామాప్రెగడ జగన్నాథకవి యనియు వాడుక పేర్లు కలవు. ఈతఁడార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. కౌశిక గోత్రజుఁడు. గంగన్న, దానమ్మల పుత్రుఁడు. పడమటి గోదావరిజిల్లా, ఏలూరి సమీప మునగల పెదపాడీతని నివాసము. ఈతఁడు 'ప్రబంధ రత్నాకర' మను నైదాశ్వాసముల గ్రంథమునుగూర్చెను. అందు మూఁడాశ్వాసములుమాత్రమే

లభించినవి. ఉపలబ్ధ భాగమును కృత్యాదితోఁగూడ వేఱొక సంకలన గ్రంథముతోఁ గూర్చి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'ప్రబంధరత్నావళి' అను పేరితోఁ బ్రకటించియున్నారు. ఇందు వివిధకవుల గ్రంథములనుండి పద్యము లుదాహరింపఁబడినవి.

జగన్నాథకవి మాదయ్యగారి మల్లన్న, తెనాలి రామలింగఁడు అను కవుల వఱకును ఉదాహరణములను గ్రహించెను. రామరాజభూషణుడు, పింగళి సూరన్నల పద్యముల నుదాహరింపలేదు. కావున నీతఁడు కీ. శ. 1560 ప్రాంతమున నుండెనని శ్రీ ప్రభాకర శాస్త్రిగారు వ్రాసియున్నారు. ఈజగ్గకవి యుదాహరించిన కవులు. వారి గ్రంథములు – (ప్రసిద్ధముగా నున్నవి) ఇచ్చటఁ జూపఁ బడును

కాను కొలను అన్నమరాజు – ఈతఁ డమరుక కావ్యము నాంధ్రీకరించెను. ఆ గ్రంథము లభింపలేదు. ఈతఁడు క్రీ. శ. 1484 లో నుండినట్లు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు తెల్పుచున్నారు.

తెల్లపూఁడి కసవరాజు – ఈతఁడు "కళావతీ శతకము"ను రచించెను. దీనికి మకుట నియమములేదు. పద్యములును వేర్వేరు ఛందస్సులలో నున్నవి.

బొడ్డపాటి కొండయ – నియోగి బ్రాహ్మణుఁడు. బొడ్డపాడు నివాసము 'అంగసంభవ! తిరుకాళహస్తిలింగ!' అనుమకుటముతో నీతిపద్యములు కొన్నియున్నవి. అవి యేగ్రంథముననైన నున్నవో, లేక విడిపద్యములో తెలియలేదు.

చిరుమూరి గంగరాజు — ఈతఁడు 'కుశలవోపాఖ్యానము'ను రచించెను. కాకుమాని గంగాధరుఁడు — ఈతఁడు 'బాలభారతము'ను రచించెను.

చంద్రమౌళికవి – ఈతఁడు హరిశ్చంద్ర కథను పద్యకావ్యముగా రచించెను తురగా రామకవి, అయ్యంకి బాలసరస్వతి యీతనిని స్తుతించి యున్నా

రనియు, ఇతఁడు 1480-1530 నడుమ నుండెననియు 'ఆంధ్రకవి తరంగిణి' లోఁ గలదు.

కుడిచెర్ల తిప్పరాజు - ...... 'కాంచీ మాహాత్మ్యము'ను రచించినట్లు 'ప్రబంధ రత్నావళిని' బట్టి తెలియుచున్నది. ఆ గ్రంథములభించలేదు.
ఆమడూరి నరసింహభట్టు - ఈ కవి 'షోడశరాజచరిత్రము'ను రచించెను.
బొడ్డపాటి పేరయకవి-ఈతఁడార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. ఆత్రేయ గోత్రుఁడు. బెజవాడకు చేరువనున్న బొడ్డపా డీతని నివాసము. ఈ కవి అనంత మహత్త్వము, పద్మినీ వల్లభము, మంగళగిరి విలాసము, శంకర విజయము, సూర్యశతకము, మల్లికార్జునలింగ శతకము అను గ్రంథములను రచించెను. ఈతని కవిత్వము రసవంతమైనది. ఇతని గ్రంథములు లభించ లేదు.

పోతమరాజు-ఈతఁడు 'పర్వతపురాణము' ను రచించెను. ఈ గ్రంథము లభించలేదు.

అంగద బసవయ్య-ఈతఁడు 'ఇందుమతీ కల్యాణము' ను రచించెను. ఆ గ్రంథము లభించలేదు.

తులసి బసవయ్య-ఈ కవి 'సావిత్రీ కథ' ను ప్రబంధముగా రచించెను. ఆ గ్రంథము లభించలేదు.

మద్దికాయల మల్లయ్య-ఈతఁడు 'రేవతీపరిణయ' మను ప్రబంధమును రచించెను. ఇది లభించలేదు.

నండూరి మల్లయ్య-ఈతఁడు 'హరదత్తోపాఖ్యానము' ను రచించెను. ఆ గ్రంథము దొరకలేదు.

ఘటశాసి మల్లుభట్టు-ఈతఁడు 'జలపాలి మాహాత్మ్యము' ను రచించెను. ఆ గ్రంథము లభించలేదు.

ఫణిధవు మాధవుఁడు-ఈతఁడు 'ప్రద్యుమ్న విజయము' ను రచించెను. అది లభింపలేదు.

నెల్లూరి ముత్తరాజు-ఈతఁడు 'పద్మావతీ కల్యాణ' మను ప్రబంధమును రచించెను.

బైతరాజు ముమ్మయ-ఈతఁడు 'విష్ణుకథా నిధాన' మను ప్రబంధమును రచించెను. ఈగ్రంథము లభించలేదు. ఈతని రచన ప్రౌఢమై హృదయంగమమై యుండును.

వాసిరాజు రామయ్య- ఈకవి బృహన్నారదీయము నాంధ్రీకరించెను. ఈతఁడే 'ఆంధ్రకవి-రామయ్య' యై యుండునేమో యని శ్రీ వీరేశలింగము పంతులుగారును, శ్రీ ప్రభాకరశాస్త్రిగారును సందేహమును తెల్పియున్నారు.
కంచిరాజు సూరయ్య-ఈతఁడు 'కన్నప్ప చరిత్రము' ను పద్యకావ్యముగా రచించెను. కూచిమంచి తిమ్మకవియుఁ దన 'సర్వలక్షణసార సంగ్రహము'న నీతని పద్యము నొకదాని నుదాహరించెను.

దామరాజు సోమయ్య-ఈతఁడు 'భరతము' ను రచించెనఁట ; అది నాట్యశాస్త్రమునకు సంబంధించి యుండవచ్చును. ఆ గ్రంథము లభించలేదు.
పాలపర్తి సోమేశ్వరుఁడు-ఇతని పద్యములను రెంటిని జగ్గకవి యుదాహరించెను. వానిలోని వర్ణన త్రిపురాసుర సంహారమునకు సంబంధించినది. అవి వేర్వేఱు శతకములలోని వని తోచుచున్నదని 'ఆంధ్రకవి తరంగిణీ' కారులు వ్రాయుచున్నారు.

---

## దావెుర అంక భూపాలుఁడు

ఈతఁడు పద్మనాయక వంశీయుఁడు. ఇనగాల గోత్రజుఁడు చెన్నభూపాలునకును, తిమ్మాంబకును పుత్రుఁడు. ఈతఁడు 'ఉషాపరిణయ' మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి శ్రీరామచంద్రున కంకితమిచ్చెను. ఈ గ్రంథమముద్రితము. ఈకవి క్రీ. శ. 1639 తర్వాత దీనిని రచించియుండు నని తెలియుచున్నది,

## కంచర్ల అయ్యన

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. ఆత్రేయసగోత్రుఁడు. మల్లన, గురవమ్మల పుత్రుఁడు. ఈతఁడు 15-వ శతాబ్ది చివఱను, 16-వ శతాబ్ది ప్రారంభమునను ఉండెనఁట ఈతఁడు 'కాశీఖండము'ను ద్విపద కావ్యముగా రచించెను. ఆగ్రంథము లభించలేదు.

## ఎడపాటి ఎఱ్ఱయ

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు, కౌండిన్య గోత్రుఁడు. సోమయామాత్యుని పుత్రుఁడు. ఈనియింటిపేరు 'పెదపాటివా'రని కొందఱి యభిప్రాయము. అది సరికాదని 'ఆంధ్రకవితరంగిణీ' కారులు వ్రాయుచున్నారు. ఈతఁడు "మల్హణచరిత్ర" మను మూఁడాశ్వాసముల ప్రబంధమును రచించి తన బంధువగు చుండి కాళయామాత్యున కంకిత మిచ్చెను. ఈతఁడు "కుమార నైషధము" ను రచించినట్లు జగ్గన కూర్చిన ప్రబంధరత్నాకరమును బట్టి తెలియు చున్నది. కాని యాగ్రంథము లభింపలేదు. ఈతఁడు వ శతాబ్ది ప్రథమపాదమున నుండెనఁట!

## చింతలపూఁడి ఎల్లనార్యుఁడు

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. కామయ్య, లక్ష్మమ్మల కుమారుఁడు. కృష్ణదేవరాయల వలన 'రాధామాధవకవి' అను బిరుదమును సంపాదించినవాఁడు. 'రాధామాధవ' మను ప్రబంధమును రచించుట వలన నీబిరుదు లభించినది. ఈగ్రంథము 1520-30 నడుమ రచింపఁబడి యుండవచ్చును, ఈకవి 'తారకబ్రహ్మ రాజీయ' మను ప్రబంధమును కూడ రచించెను. అది నాలుగాశ్వాసముల వఱకే కానవచ్చుచున్నదఁట! 'విష్ణుమాయా నాటక'మను రసవత్ప్రబంధము నీతఁడు రచించినట్లు ప్రతీతి. కాని దానిని 'మడికి అనంతయ్య' రచించెనని 'ఆంధ్రకవితరంగిణీ'కారులను చున్నారు.

## కామినేని ఎల్లారెడ్డి

ఈతఁడు మెదకుజిల్లాలోని చిక్కనవోలు నివాసి. దోమకొండ సంస్థానాధిపతి: కామినేని మల్లారెడ్డి సోదరుఁడు; క్రీ. శ. 1550-80 నడుమ నుండిన వాఁడు. వాసిష్ఠ, లింగపురాణము లీతని గ్రంథములు. ఆ గ్రంథములు లభించలేదు.

పట్టమట్ట సోమనాథకవి రచించిన 'బ్రహ్మోత్తర ఖండము' న కీతఁడు కృతి పతి.

## రావూరి ఎల్లయ

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. వేంకనామాత్యుని పుత్రుఁడు. తిరుమల తిరువేంకటాచార్యుని శిష్యుఁడు. కేసన, మల్లన కవుల గురువు నీ తిరువేంకటాచార్యులే ! ఈ యిర్వుః నభిన్నులైనచో నీ కవి కాలము క్రీ. శ. 1600 ప్రాంతమగును. లేదా ఎఱ్ఱన సమకాలికుఁడైనచో 1500 ప్రాంతమువాఁడగునఁట ! ఏలయన తిరువేంకటాచార్యులిర్వురు కలరఁట !

ఈతఁడు 'బ్రహ్మాండపురాణ' మను నాలుశ్వాసముల పద్యకావ్యమును, 'మిత్రవిందాపరిణయ' మను ప్రబంధమును రచించెను.

## విక్రమనాథుఁడు

ఈతఁడు 'ప్రతాపచరిత్ర' మను వచన గ్రంథమును వ్రాసెను. 14-వ శతాబ్ది నాఁటి యోరుగంటి వృత్తాంతమందుఁగలదు. కవి 14-వ శతాబ్ది వాఁడు. ఈతఁడు ద్వాత్రింశత్సాలభంజికల కథలను గూడ రచించెనఁట !

## పొన్నతోఁట బొబళికవి

ఈతని తండ్రి పేరును బొబళుఁడే ! ఈ కవి 1540 ప్రాంతముననుండెనఁట! మార్కండేయ పురాణము, వామన పురాణము అను నీతని గ్రంథములు

నందు మైసూరు ప్రాంతమందలి చెన్నపట్టణమునకు ప్రభువైన రాణా జగ దేవభూపతికి అంకితమీయఁబడినవి. మార్కండేయ పురాణమముద్రితము. అది పది యాశ్వాసములు కలది. వామన పురాణము లభించలేదు.

## కందనామాత్యుఁడు

ఈతఁడు మడికి సింగన రచించిన 'పద్మపురాణము' నకుఁ గృతికర్త. 1380-1440 నడుమ నుండినవాఁడు. ఈతఁడు 'నీతి తారావళి' ని రచించెను. అందలి నాల్గు పద్యములు సింగన కూర్చిన 'సకలనీతి సమ్మతము' లోఁ గలవు.

## నందూరి కేతనమంత్రి

మంచన రచించిన కేయూరబాహు చరిత్రమున కీతఁడు కృతిపతి. ఈతఁడు కవియేగాని, యీతని గ్రంథములు లభింపలేదు కువలయాశ్వచరిత్రము వ్రాసిన కేతన యీతఁడేమో పరిశీలింపవలెనని 'ఆంధ్రకవి తరంగిణి' కారులు వ్రాయుచున్నారు. ఈతఁడు 1300 ప్రాంతము వాఁడు.

## బమ్మెర కేసన, మల్లన కవులు

సోదరులగు నీ యిర్వురును నియోగి బ్రాహ్మణులు. బమ్మెర పోతనామాత్యుని మునిమనుమలు. మల్లయామాత్యుని మనుమలు, ప్రౌఢ సరస్వతి కుమారులు బమ్మెర నివాసులు వీరి కాలము క్రీ. శ. 1550-1620 ప్రాంతమని 'ఆంధ్రకవి తరంగిణి'

ఈ జంటకవులు 'దాక్షాయణీ పరిణయము, విష్ణుభజనానందము' అను రెండు గ్రంథములను రచించిరి. మొదటిది పులిజాల సోమంత్రికంకితము. రెండవది పెనుమెత్స నాగభూపాలునకంకితము, వీరి రచన రసవంతమైనది.

## కొలని గణపతి దేవుఁడు

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. గణపతికి మనుమఁడు. ఆదిమూర్తికిఁబుత్రుఁడు. ఈ కవి ముత్తాతయగు రుద్రదేవుఁడు క్రీ. శ. 1326 వఱకును రాజ్యమేలిన ప్రతాపరుద్రుని యొద్ద మంత్రిగా నుండెను. కావున గణపతి దేవుఁడు 1400 ప్రాంతమున నుండెనని చెప్పవచ్చును. శ్రీ వీరేశలింగము పంతులుగారు 3-వ భాగమునఁబేర్కొనిన అనియాది గణపతి దేవుఁడీతఁడేమో !

## వణుకూరి గుర్వరాజు

ఈతని 'శమంతకమణి చరిత్రము' లోని పద్యము నొక దానిని అప్పకవి యుదాహరించినాఁడు. కావున 1650 కంటె నీతఁడు పూర్వుఁడు ఈతని గ్రంథము లభించలేదు.

## గోపమంత్రి

హైదరాబాదు ప్రాంతములోని గార్ల యీతని నివాసము. ఈతఁడు క్రీ. శ 1600 ప్రాంతము వాఁడు. ఈ కవి 'సింధుమతీ విలాస' మను పద్య కావ్యమును రచించెను.

ఈతఁడు భారద్వాజగోత్రుఁడు. నరసనా మాత్యుని పుత్రుఁడు.

## తాళ్లపాక చినతిరుమలాచార్యులు

ఈతఁడు తాళ్లపాక అన్నమాచార్యుల పౌత్రుఁడు. పెదతిరుమలాచార్యుల జ్యేష్ఠపుత్రుఁడు. చిన్నన్నకు అన్న. ఈతఁడు 1480 ప్రాంతమున జన్మించి యుండవచ్చునఁట ! ఈ కవి 'అధ్యాత్మ సంకీర్తనలు, శృంగార సంకీర్తనలు, అష్టభాషాదండకము, సంకీర్తన లక్షణమను పద్యకావ్యము అను గ్రంథములను రచించెను.

## కాశీ చెన్నబసవేశ్వరుఁడు

ముకుందయోగి మహారాష్ట్రి భాషలో రచించిన 'వివేక సింధువు' న కీతఁడు వచనాను వాదము నొనర్చెను. ఈతని రచన ప్రశ స్తమైనదఁట! ఈకవి క్రీ. శ. 1600 ప్రాంతమున నుండెనఁట!

## వెన్నెలకంటి జన్నమంత్రి

ఈతఁడార్వేల నియోగి. హరితసగోత్రుఁడు. సిద్ధమంత్రి కుమారుఁడు. సంగమవంశజుఁడును, విజయనగర ప్రభువునగు దేవరాయలవద్ద నుద్యోగి. ఈతఁడు క్రీ. శ. 1360-1420 నడుమ నున్నట్లు దెలియుచున్నది.

ఈతఁడు 'కృష్ణా! దేవకీనందనా!' అను మకుటముతోనొక శతకమును రచించెను. దానికి 'దేవకీనందన శతక' మనిపేరు. ఇది జన్నయ కృతమైనట్లు జక్కన విక్రమార్కచరిత్రము వలనఁ దెలియుచున్నది. ఈ శతకము తిక్కన కృతమని కొందఱును, కవిరాక్షస కృతమని కొందఱును తలంచిరి. అట్లుతలంచుట పొరపాటు.

## రాయఁకవి తిప్పయ్య

ఈతనికి 'అయ్యలరాజు త్రిపురాంతకుఁ'డనియు పేరు. ఈతఁడు 'ఒంటిమిట్ట రఘువీర శతకము'ను రచించినట్లు అయ్యలరాజు రామభద్రకవియు, ఈతఁడు శతకకర్తయైనట్లు అయ్యలరాజు, అయ్యల భాస్కర కవులును చెప్పియున్నారు. ఈతఁడు రెండవ దేవరాయల యాస్థానకవియఁట! అది యథార్థమగుచో నీతని కాలము క్రీ. శ. 1440 ప్రాంతమగును.

ఈతని శతకమునకు "రఘువీరా! జానకీ నాయకా!' అనునది మకుటము. ఈతని కవిత్వ మనర్గళమై, మనోహరమై, యుండును.

## తాళ్లపాక తిమ్మక్క

ఈమె తాళ్లపాక అన్నమాచార్యుల సతీమణి. ఈమెను "తిరుమలాంబ, తిమ్మాంబ" అనియు పిలిచెడి వారఁట! ఈమె 'సుభద్రాకల్యాణ' మను గేయకావ్యమును రచించెను. రచనహృదయం గమమైనది.

## సిద్ధరాజు తిమ్మరాజు

ఈతఁడు చంద్రవంశక్షత్రియుఁడు. హరితసగోత్రుఁడు. ఔబళరాజు. కోమాంబల పుత్రుఁడు. కృష్ణరాయల యల్లుఁడైన రామరాయల కీతఁడు మేనల్లుడగుటచే నితనికాలము క్రీ. శ. 1500-1564 మధ్యభాగమై యుండును, ఈతడు 'పరమయోగివిలాస' మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి, మంగళగిరి నరసింహస్వామి కంకితమొనర్చెను. ఇందు పంద్రెండుగురు ఆళ్వారులయు, శ్రీరామానుజులయు చరిత్రములు కలవు. ఈతని రచన మృదుమధురమైనది.

## పచ్చకప్పురపు తిరువెంగళకవి

ఈతఁడు భట్టుకులమునకుఁ జెందినవాఁడు: తిమ్మరాజుపౌత్రుఁడు; తిప్పరాజు పుత్రుఁడు. ఈతని తాతయు, పినతాతయు, ప్రౌఢదేవరాయలను మెప్పించి యాతనివలన 'పచ్చకప్పురమురాజు 'బిరుదమును సంపాదించిరఁట! ఈతఁడు 'చొక్కనాథచరిత్ర'మను తొమ్మిదాశ్వాసముల ద్విపదగ్రంథమును రచించి గోళ్ల పెదరామభూపాలునకుఁ గృతియొసఁగెను. ఈతఁ డచ్యుతరాయలయొద్ద దండాధికారిగా నుండెను. కావున నీకవి క్రీ. శ. 1535 ప్రాంతమున దీనిని రచించి యుండవచ్చును. ఇందు మధురలోని చొక్కనాథస్వామియొక్క యఱువది నాలుగు లీలలును వర్ణింపఁబడినవి. ఇందలి కవిత్వము హృదయంగమమైనది.

## తాళ్లపాక తిరువెంగళప్ప

ఈతఁడు తాళ్లపాక, అన్నమాచార్యుల మనుమఁడగు చిన తిరుమలాచార్యుని పుత్రుఁడు. 16-వ శతాబ్ది ప్రారంభమున జన్మించినవాఁడు. ఈతఁడు కావ్య ప్రకాశమునకును, నామలింగాను శాసనమునకును వ్యాఖ్యలను రచించెను. అమరుక కావ్యము నాంధ్రీకరించెను. చివఱిరెండు గ్రంథములును ముద్రితములు.

## దోనయామాత్యుఁడు

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు మాచిరాజు రాజు, రుద్రాంబల పుత్రుఁడు. ఈకవి సస్యానందము, సర్వలోకాశ్రయము అను రెండు గ్రంథములను వ్రాసెను. సస్యానందము నాల్గాశ్వాసముల గ్రంథము. అది శ్రీశైల మల్లికార్జునస్వామి కంకితము, ఇందు పంటలకు సంబంధించిన విషయములు పూర్తిగాఁగలవు. ఇతని, 'సర్వలోకాశ్రయము' లభించలేదు. సస్యానంద రచనాకాలము విభిన్నప్రతులలో విభిన్నరీతుల నున్నది. 1356 లోఁగాని, 1360 లోఁగాని, 1366 లోఁగాని అది రచింపఁబడి యుండవచ్చునట!

ఉపేంద్రుఁడు తన్నాదరింపఁగా దీనిని వ్రాసినట్లు కవి తెల్పియున్నాఁడు. ఆ యుపేంద్రుఁడు మూఁడవ యుపేంద్రుఁడని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు మున్నగువారి యాశయము, అట్లయినచో సస్యానందము 1356 లో రచింపఁబడెనని చెప్పవలెను.

## దూబగుంట నారాయణకవి

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. మైత్రావరుణ గోత్రుఁడు బ్రాహ్మనామాత్యునకును, నాగమాంబకును బుత్రుఁడు. నారయ యని యీతని వాడుకపేరు. ఈతని యింటిపేరు 'ప్రబంధవాచకాభరణమువా'

రనియు. దూబగుంటకుఁ గరణములైన కారణమున 'దూబగుంట' యను నింటిపేరు వచ్చెననియు 'ఆంధ్రకవితరంగిణి' లోఁ గలదు. ఈతఁడు 15 – వ శతాబ్దిలోని యుత్తరార్థమున నుండెను. సంస్కృతమున విష్ణు శర్మ రచించిన 'పంచతంత్రము' ను పద్యకావ్యముగా రచించి, యీకవి పూసపాటి తమ్మరాజు పుత్రుఁడగు బసవరాజున కంకిత మొనర్చెను. ఈతని కవిత్వము మధురమై ధారాశుద్ధి కలిగియుండును.

## ఎల్లకర నృసింహకవి

ఈతడు కృష్ణయార్యుని పుత్రుఁడు. తిరుమల లక్ష్మణకవికి శిష్యుఁడు. క్రీ. శ. 1511-1568 నడుమ నుండిన సుప్రసిద్ధ వైష్ణవాచార్యుఁడు. ఈతఁడు 'మార్కండేయ పురాణము' ను ద్విపదకావ్యముగా, రచించెను. 'భారత సావిత్రి' ని వచనముగా రచించెను. శ్రీకృష్ణుఁడు విదురునింట విందారగించుట 'భారత సావిత్రి' లోని విషయము.

## తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు

ఈ తఁడు తాళ్లపాక అన్నమాచా ర్యులకుమారుఁడు. అక్క లమ్మ యీతని తల్లి. తిమ్మక్క సవతితల్లి. తిరుపతి యీతని నివాసము. క్రీ.శ. 1460 ప్రాంతమున జన్మించి, 1546 ప్రాంతము వఱకును జీవించి యుండె నఁట ! ఈతడు శృంగార కీర్తనలు, శృంగార దండకము, శృంగారవృత్త శతకము, వైరాగ్యవచన గీతములు, చక్రవాళమంజరి. వేంకటేశ్వరోదాహర ణము, సుదర్శనరగడ, రేఫఱకార నిర్ణయము, మేలుకొల్పు ద్విపద, భగవద్గీతావచనము, సంకీర్తనలక్షణము, ఆంధ్రవేదాంతము. ఆంధ్ర హరి వంశము అను గ్రంథములను రచించెను.

## పెదకెంపరాయఁడు

ఈతఁడు కెంపగౌడ కుమారుఁడు. క్రీ. శ. 1513-1565 నడుమఁ గల్ల కాలమున నవిచ్ఛిన్నముగ బెంగుళూరు ప్రాంతమును పాలించి, బెంగు

శూరిని నిర్మించెను. కృష్ణదేవరాయల చేతను, అచ్యుతరాయలచేతను మన్ననల నందెను. ఈతఁడు "గంగాగౌరీవిలాస" మను యక్షగానమును రచించి హల్సూరిలోని సోమేశ్వరస్వామి కంకితమొనర్చెను.

## కాచిరాజు బసవన్న

ఈతనిఁ గూర్చిన విశేషములు తెలియలేదు. చిత్రకవి పెద్దన యీతనిని నుతించుటచే ఈ కవి క్రీ. శ. 1480-1530 నడుమనుండి యుండవలెను. ఈతని 'కవిసర్పగారుడము' ను కాకునూరి అప్పకవియు స్మరించెను. ఆంధ్రపరిషత్కార్యాలయములో నున్న 'కవిసర్పగారుడ' మీతని రచనయగునో. కాదో నిశ్చయింపనవకాశములేదు. అందు గ్రంథాంత రములలోని పద్యములును చేరినవఁట!

## భా ను క వి

ఈతఁడు పంచతంత్రమును తెనిఁగించి శ్రీకృష్ణదేవరాయల కాలములో నుండిన లక్ష్మీనారాయణ కంకితమొనర్చెను. ఈకవి నియోగి బ్రాహ్మ ణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. అప్పనమంత్రి పుత్రుఁడు. విజయనగర నివాసి. ఈతఁడు క్రీ. శ. 1510-30 నడుమనుండెను.

## కలిదిండి భావనారాయణ

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. సాలంకాయన గోత్రుఁడు. వేంకటాద్రి, సూరమ్మల కుమారుఁడు. ఈతఁడు విష్ణుపురాణము నందలి నాలుగంశలను నాల్గాశ్వాసముల ప్రబంధముగా రచించి జగన్నాథస్వామి కంకితమొనర్చెను. ఈతఁడు వైష్ణవాభిమాని, కందాళ శ్రీనివాసాచార్యు లీతని గురువు. తిరు పతిలో శ్రీరంగాచార్యుల శాసనము 1545 నాఁటిది కలదు, కావున నీకవి

యాకాలపువాఁడే కావలెను. ఈతని విష్ణుపురాణము ముద్రితము. ఈకవి "పురుషోత్తమ ఖండము"ను గూడ ఆంధ్రీకరించెనఁట. ఆ గ్రంథములభింప లేదు.

## చెదలువాడ మల్లన

ఈతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. లింగన్న, కామాక్షమ్మల పుత్రుఁడు. ఎఱ్ఱాప్రెగడ వంశీయుఁడఁట! ఈతఁడు 'విప్రనారాయణచరిత్ర' మను నైదాశ్వాసముల ప్రబంధమును. రుక్మాంగద చరిత్రమను ద్విపదకావ్యమును రచించెను. తొలిగ్రంథమును నూకరాజు కుమారుఁడు తిరుమల రాజున కంకితము. రుక్మాంగద చరిత్ర మలభ్యము, అందలి ద్విపద నొకదాని నప్పకవి యుదాహరించెను. అది రామయభాస్కరున కంకితమఁట! ఈతఁడు క్రీ. శ. 1500 ప్రాంతమున నున్నట్లు "ఆంధ్రకవితరంగిణి" చెప్పుచున్నది.

సారంగు తమ్మయ్య వ్రాసిన వైజయంతీ విలాసమునను, ఈ విప్రనారా యణ చరిత్రమునను కథయొక్కటే! ఇర్వురును సమకాలికులు.

## ముమ్మడి మల్లన్న

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. శాండిల్య గోత్రుఁడు. కృష్ణమంత్రి. రఘుపతమ్మల పుత్రుఁడు. కృష్ణాజిల్లాలోని కొప్పురావూరీతని నివాసమఁట! ఈతఁడు "శ్రీరామ స్తవరాజ" మను మూఁడాశ్వాసముల గ్రంథమును రచించి శ్రీకృష్ణునకంకితమిచ్చెను. ఈతఁడు "తత్త్వచంద్రోదయము" అను వేదాంత గ్రంథమును ద్విపదగా రచించినట్లును, ధేనువుకొండ తిమ్మయా చార్యుని శిష్యుఁడైనట్లును కవియే చెప్పియున్నాఁడు. వేదాంతవిషయము లను సులభముగాఁ జెప్పుటలో నీతఁడు సమర్థుఁడు. ఈతని 'శ్రీరామ స్తవ రాజము' 16—వ శతాబ్దియందలి ఉత్తరార్ధమున రచింపఁబడినట్లాంధ్రకవి తరంగిణిలోఁ గలదు.

## ప్రౌఢకవి మల్లన

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. పోతయ్య, అమ్మ లమ్మల పుత్రుఁడు శక్తినాథుని శిష్యుఁడు. ఈకవి "రుక్మాంగద చరిత్ర" మనునామాంతరముగల ఏకాదశీమాహాత్మ్యము నైదాశ్వాసముల ప్రబంధముగా రచించెను. ఇది దాక్షారామములోని భీమేశ్వరస్వామి కంకితము. ఈతఁడు 15-వ శతాబ్దిలో నుండినట్లు చాలమంది తలఁచుచున్నారు. ఈతని కవిత్వము సలక్షణమై, ప్రౌఢమై, మనోహరముగా నుండును.

## మల్లారెడ్డి దేశాయి

ఈతఁడు పర్వతరెడ్డి మనుమఁడు. రంగారెడ్డి పుత్రుఁడు. ఈతని పెదతాత 'కుతుబ్‌షా' కాలములో (16-వ శతాబ్ది తొలి భాగమున) ఉండెనఁట;కావున నీతఁడు 1600 ప్రాంతమున నుండవచ్చును, ఈతఁడు 'గంగాపురమాహాత్మ్య'మను ప్రబంధమును రచించెను. అది అసమగ్రము, అముద్రితము, గంగాపురము హైదరాబాదు ప్రాంతములోనిది,

## మాతృభూతకవి

క్రీ. శ. 1788-89లో నొక్క వత్సరకాలము తంజావూరినిపాలించిన అమరసింహప్రభుని యాస్థానమున నుండిన యీకవి 'పారిజాతాపహరణ'. నాటకము‌ను రచించెను. ఈ కవి శాండిల్య గోత్రుఁడు. రంగయార్యునిపుత్రుఁడు పారిజాతాపహరణ మైదంకములు కలది. గ్రంథ మమరసింహప్రభువున కంకితము, ఈకవి కొన్ని పదములను గూడ రచించెనఁట!

## రెడ్డిపల్లె ముద్దమరాజు

ఆంధ్రసాహిత్య పరిషత్తులో నున్న సంకలన గ్రంథములో నీతని 'అష్టమహిషీ కల్యాణము' లోని రెండు పద్యము లుదాహృతములు. ఈ కవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు.

## పోశెట్టి లింగకవి

ఈతఁడు వీరశైవుఁడు. కులాలవంశసంజాతుఁడఁట! గార్లపాటి లక్ష్మణకవి శిష్యుఁడు. కాలము 15-వ శతాబ్ది చివరి భాగమఁట! లింగకవి 'నవచోళ చరిత్రము, మలహణ చరిత్రము, శంకరదాసమయ్య చరిత్రము, వీరసంగమయ్య దేవరచరితము. శిష్య ప్రబోధము అను ద్విపదకావ్యములను రచించెను. వీనిలో 'నవచోళ చరిత్ర' మొక్కటియే లభ్యమైనది; అది ముద్రితము కూడ. కవి దీనిని బగిరామపల్లెలోనిఁ మృత్యుంజయేశ్వరున కంకితమొనర్చెను. కృతికర్త దేవుఁడని శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు గ్రంథ పీఠికలో వ్రాసి యున్నారు. ఇతఁడు మానవుఁడేయని 'ఆంధ్రకవి తరంగిణి' యాశయము.

## భద్రకవి లింగకవి

ఈతఁడు జంగమకులమునఁ బుట్టినవాఁడు, రామయ్య, అమలాంబల పుత్రుఁడు. కాళహస్తియందలి సంగమేశ్వరుఁడీతని గురువు. ఈ కవి 'సానంద చరిత్రము, దేవాంగపురాణము' అను రెండు ద్విపదకావ్యము లను రచించెను.

సానందోపాఖ్యానము, మూఁడాశ్వాసముల గ్రంథము, ఇందు సానందుఁడను ముని పంచాక్షరీ ప్రభావమున యమలోక వాసులకు నరక బాధను తప్పించిన విషయము కలదు. ఇది సంగయదేవర కుమారుఁడు వీరభద్రయ్య కంకితమొనర్పఁబడెను. దేవాంగపురాణ మేడాశ్వాసముల గ్రంథము. మను మహర్షి యీశ్వరునకు దేవాంగఋషిగా జన్మించి పెక్కవతారంబుల దాల్చిన కథ యిందు వర్ణితము. ఇది ముదునూరిలోని రామేశ్వరస్వామి కంకితము. ఇవి యముద్రితములు. కవిత్వము రసవంతముగ నుండును.

ఈతఁడచ్యుత దేవరాయలకాలములోని వాఁడఁట! కావున క్రీ.శ. 1530-42 ప్రాంతమువాఁడై యుండును.

## పోతరాజు వీరన్న

ఈ కవి 'త్రిపురవిజయము' ను రచించినట్లు 'ప్రబంధ రత్నావళి' ని బట్టి తెలియుచున్నది కవి క్రీ. శ. 1560 కంటెఁ బ్రాచీనుఁడు.

## జక్కరాజు వేంకటరామకృష్ణకవి

ఈతనికి వేంకటకవి యనియు పేరు కలదు. ఈ కవి భారద్వాజగోత్రుఁడు, ఎఱ్ఱయామాత్యుని పుత్రుఁడు 'ఆంధ్రకామందక' మను నెనిమిదాశ్వాసముల గ్రంథమును రచించి కొండ్రాజు-తిమ్మరాజు పుత్రుఁడగు వేంకటాద్రి కంకిత మొనర్పఁబడెను. ఇది రాజనీతిని తెల్పు గ్రంథము. ఇది క్రీ. శ. 1584 లో రచింపఁబడినట్లు గ్రంథస్థ ప్రమాణము కలదు. కావున నీతఁడు 16 - వ శతాబ్ది చివఱనుండెనని చెప్పవచ్చును- గ్రంథము చివఱి పద్యములో 'వేంకట రామకృష్ణు'లని యుండుటచే నిది యిర్వురిచే రచింపఁబడినట్లు భ్రాంతి కల్గుట కవకాశము కలదు. కాని దీనిని వ్రాసిన యాతఁడొకఁడే. ఇర్వురు కారు.

## మారన వేంకయ్య

ఈతని 'భాస్కర శతకము' లోని పద్యమును అప్పకవి యుదాహరించి నందున, ఈ కవి అప్పకవికంటెఁ బూర్వుఁడగుట నిశ్చయము. ఈతని 'భాస్కర శతకము' మిగుల ప్రచారమునకు వచ్చిన శతకములలో ప్రధాన మైనది-

## దామెరల వెంగళభూపాలుఁడు

ఈతఁడు పద్మనాయక వంశజుఁడు. ఇనగాల గోత్రజుఁడు వేంకటాద్రికిని, గురవమ్మకును పుత్రుఁడు. ఈతఁడు 'బహుళాశ్వ చరిత్రము' నైదాశ్వాసముల

ప్రబంధమును రచించి తన తండ్రి యగు వేంకటాద్రికే యంకితమొనర్చెను. ఈతని తండ్రి కుతుబ్‌షా వలన బహుమతులనందినట్లు కవియే చెప్పెను. కావున వీరిర్వురును 1550-60 నడుమ నుండి రనుట స్పష్టము.

ఈ కవి కవిత్వము ప్రౌఢమై, చక్కని భావములతో మనోహరముగా నుండును.

## తెనాలి శ్రీగిరికవి

ఈతఁడు ప్రథమశాఖాబ్రాహ్మణుఁడు. కౌండిన్య గోత్రుఁడు రామయ పండితుని పుత్రుఁడు. రామకృష్ణకవికిని, అన్నయకును సోదరుఁడు. ఈతఁడు క్రీ. శ. 1505-1560 నడుమ నుండియుండునని 'ఆంధ్రకవితరంగిణి' కారుల యభిప్రాయము.

ఈకవి 'శ్రీశైలమాహాత్మ్య' మను పద్యకావ్యమును రచించినట్లీతని మనుమఁడు రామభద్రకవి తన గ్రంథమున (ఇందుమతీ పరిణయమున) తెలిపి యున్నాఁడు. శ్రీగిరికవి గ్రంథము లభించలేదు .

## శ్రీ ధ రుఁ డు

ఇతని పేరఁ గల శ్రీధరచ్ఛందస్సును బట్టి యీతండొక కృతికర్తయని తెలియుచున్నది. శ్రీధరచ్ఛందస్సు లభింపలేదు. అందలి పద్యములను కొన్నింటిని కస్తూరిరంగకవి రంగరాట్ఛందస్సున నుదాహరించియున్నాఁడు. శ్రీధరచ్ఛందస్సు - రాయల యల్లుఁడగు రామరాయల ముత్తాత కంకిత మఁట! అతఁడు సోమభూపాలుఁడట। సోమభూపాలు రిర్వురున్నారు. ఎవరి కంకితమో నిశ్చయింప వీలుకాదఁట। ఈకవి క్రీ. శ. 1450 ప్రాంతము వాఁడు కానగునని 'ఆంధ్రకవి తరంగిణీ' కారుల యభిప్రాయము.

## సిద్ధరామ కవి

ఈతఁడు వీరశైవుఁడు; "ప్రభుదేవరవాక్య" మనునొక వేదాంత గ్రంథమును వచనముగా వ్రాసెను. దీనికి 'పిండచక్రనిర్ణయ' మను నామాంతరము

కలదు. ఇందు వీరశైవమత ప్రచారకులలో నొకఁడగు మల్లయప్రభుని తత్త్వోపదేశము కలదు. ఈకవి 'చిత్కళాధామః శ్రీగురుసిద్ధరామః' అను మకుటముతో నొకశతకమును గూడ రచించెను. ఇది ప్రాచీనశైవ సమయాచార్యునిఁ గూర్చినదఁట!

ఈకవి కేదారదేశికుని శిష్యుఁడు. క్రీ. శ. 1560 ప్రాంతమువాఁడు.

## సిద్దన ప్రెగడ

ఆంధ్ర సాహిత్య పరిషత్తులోనున్న సంకలనగ్రంథమును బట్టి యాతఁడు "శాకుంతలము"ను రచించినట్లు తెలియుచున్నది. ఆగ్రంథము లభించలేదు. ఇతఁడు 1560 కంటెఁ బూర్వుఁడు.

## సోమనాథ కవి

హైదరాబాదు ప్రాంతమందలి వేములవాడ యాతని నివాసము. 1650 ప్రాంతమున నీతఁడుండెను. ఈవిద్వత్కవి వసుచరిత్రమునకు "విద్వజ్జన మనోరంజని' అను వ్యాఖ్యను రచించెను. ఆవ్యాఖ్యనుబట్టియే యాతఁడు "చతుర్భుజాభిషేకము, యాదవచరిత్రము, గంగా గౌరీ సంవాదము" అను గ్రంథములను కూడ రచించినట్లు తెలియుచున్నది. ఆ గ్రంథములు లభించలేదు. ఇతని వసుచరిత్ర వ్యాఖ్య వేములవాడలోని రాజేశ్వరస్వామి కంకితము.

## కొటికెలపూడి సోమనాథ కవి

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడని 'ఆంధ్రకవి తరంగిణి'లోఁ గలదు. కొటికెలపూఁడివారు వెలనాటి వైదిక బ్రాహ్మణులు ప్రసిద్ధులు. ఈతఁడాత్రేయ గోత్రుఁడు. కోటేశ్వర భట్టారకుని పుత్రుఁడు. ఈతఁడు 'విష్ణుమిత్రోపాఖ్యాన' మను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి, గాంటెపల్లి (గుంటపల్లి)

తిప్పమంత్రి కంకిత మొనర్చెను. కృతికర్త క్రీ. శ. 1525 ప్రాంతమున నుండెననియు, సోమనాథకవి 1530 తర్వాత నీగ్రంథమును రచించెననియు "ఆంధ్రకవితరంగిణి"లోఁ గలదు.

## పెదపాటి సోమయ్య

సంకలనగ్రంథములం బట్టి యీతఁడు "అరుణాచల పురాణము, కేదార ఖండము, త్రిపుర విజయము, శివజ్ఞానదీపిక అను నాల్గు గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. తిమ్మకవి యీతని పద్యము నొకదాని నుదాహరించుచు 'కవిలోక బ్రహ్మ శివజ్ఞాన దీపికలోని' దని చెప్పుట వలన నీతనికి 'కవిలోక బ్రహ్మ' అను బిరుదముండెనని తెలియుచున్నది.

ఈతఁడు శ్రీనాథుని నుతించెను, సంకలన గ్రంథము లీతనిని స్మరించుటచే సోమయ్య క్రీ. శ. 1500 ప్రాంతముననుండి యుండవచ్చును. ఈతనిరచన రసవంతమైనది.

# చరిత్రము తెలియని యితరకవుల గ్రంథములు

అప్పకవీయాది లక్షణగ్రంథములలో నుదాహరింపఁబడిన గ్రంథము లిప్పుడనేకములు గానరాకున్నవి; కొన్ని గ్రంథములపేరులు తెలిసినను గ్రంథకర్తలపేరులు సహితము తెలియరాకున్నవి. అమరేశ్వరుని గొప్ప కవినిగా పూర్వకవు లనేకులు స్తుతించియున్నారు. ఈతఁడు చేసిన గ్రంథము లేవియో తెలియరావుగాని కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసార సంగ్రహమునందుఁ జిమ్మపూడి యమరేశ్వరుని విక్రమసేనములోనిదని యీ క్రింది పద్యము నుదాహరించియున్నాఁడు—

గీ. నీర నగ్గియునికి యారయ విస్మయం
బనుచు బాడబాగ్ని కడలి యప్పు
రంబుఁజొచ్చెనొక్కొ రత్నాకరముమణు
లనఁగ జెలువ మమరునాపణములు. *

ఈ ప్రకారముగానే హూణశకము ౧౬౫౦ వ సంవత్సరమునకుఁ బూర్వము నందున్నట్టు నిశ్చయముగా తెలిసిన కొందఱు కవుల గ్రంథనామములు తెలిసినను, నా కాగ్రంథము లిప్పుడు లభింపనందున గ్రంథకర్తల చరిత్ర మును గూర్చికాని వా రుండిన కాలమునుగూర్చికాని నేనిప్పుడేమియు వ్రాయుటకు శక్తుఁడను గాకున్నాను. గ్రంథకర్తల నామములు సహిత మనేకములు తెలియరాలేదు. తెలిసినవారు నా కా విషయమును తెలుపుదు రన్న యపేక్షతోను, ఇతరు లట్టి గ్రంథసంపాదనమునకయి కృషిచేయుదు రన్న విశ్వాసముతోను, ఆ గ్రంథముల పేరులనుమాత్ర మిందుఁ జెప్పి వానిలోనుండి దొరికిన పద్యముల నుదాహరించుచున్నాను.—

౧. కవులషష్ఠము — ఇది యెవ్వరు చేసినదో తెలియలేదు. పుస్తకము యొక్క పేరునుబట్టి యిది యనేక కవులు చేరి చేసిన ట్లూహింపఁదగి యున్నది. "తృతీయవర్గసరళమునకు రాచమల్లువారి షష్ఠస్కంధములోఁ

*[ అమరేశ్వరుని చరిత్రము ప్రథమభాగమున నీయఁబడినది.]

బ్రయోగ" మని యప్పకవి వ్రాసి యుండుటచే నిది రాచమల్లు వారను నింటిపేరు గల కవులచే రచియింపఁబడినట్లు స్పష్టమగుచున్నది. ఆ కవు లన్నదమ్ములయి యుండవచ్చును. *

శా. శ్రీరామామణి సీత నాథుని యురస్సీమ న్నిజచ్ఛాయఁ గ
న్నారం గన్గొని యాత్మ నన్యవనితేర్ష్యం బూనఁ దత్కంధరన్
హారం బున్చుచు నింకఁ జూడుమనఁ దా నౌటం ద్రపం జెందఁ జే
ల్వారున్ రాముఁడు బ్రోచుఁగాత మిఁకఁ దమ్మాధీశతిమ్మాధిపున్.

శా. చండాంశుప్రభ చిక్కతిమ్మయతనూజా ! తిమ్మ ! విధ్వస్తపా
షండం బైన త్రిలింగ భాగవతషష్ఠస్కంధకావ్యంబు నీ
కుం డక్కెం జతురాననత్వగుణయుక్తు ల్మీఱ వాణీమనో
భాండారోద్ధతచూరకారబిరుదప్రఖ్యాతి సార్థంబుగన్.

అని కవిసంశయవిచ్ఛేదములోను, సర్వలక్షణసారసంగ్రహములోను గవుల షష్ఠము నుండి యుదాహరింపఁబడిన పద్యములనుబట్టి యీ గ్రంథము చిక్క తిమ్మయపుత్త్రుఁడయిన తిమ్మయ కంకితము చేయఁబడినట్లు తెలియు చున్నది. ఈ తిమ్మయ యచ్యుతదేవరాయని మంత్రులలో నొకఁ డయిన ట్లొకానొకరు వ్రాసియున్నారు. అదియే నిజమైనపక్షమున బమ్మెరపోతరాజ కృతభాగవతము శిథిలము కాఁగా పోయినభాగములలో నొకటియైన యీ షష్ఠస్కంధమును ౧౫౩౦-౪౨ సంవత్సరముల మధ్యను రాచమల్లువారు చేసి యుందురు. దీనియందు శృంగారరస మధికముగా వర్ణింపఁబడినందున దీనికే శృంగారషష్ఠమని నామాంతరము కలిగియున్నట్లు కనఁబడుచున్నది.♦ అప్పకవ్యాదు లుదాహరించిన శృంగార షష్ఠములోని కొన్ని పద్యముల నిందు బొందుపఱుచుచున్నాను—

* [ రాచమల్లువారన్నంత మాత్రమున అనేక కవులనుట కవకాశము లేదనియు, గౌరవవాచకమనియు, ఒకవేళ వీరిద్దఱయి యుండిన నుండవచ్చుననియు 'ఆంధ్రకవి తరంగిణి' (సం 8)]

♦ [ ఇయ్యది క్రీ. శ. 1520-38 ప్రాంతమునాఁటిదని ఆంధ్రకవి తరంగిణి]

గీ. తల్లియును దండ్రి దైవంబు తలఁప గురుఁడ
కాఁడె? యితఁ డేమిచేసినఁ గనలఁ దగునె?
నాస్తికాధమ ! యోరి ! యన్యాయవృత్తి
నాస్తికత్వం గురోః పరమ్మనఁగ వినవె. (అప్పకవి)

మ. పదము ల్తొట్రిలఁ గొనుఁడీఁగ చలియింపం గేశము ల్వ్రాలఁ బ
య్యెద వక్షోరుహపాళిఁ జేరఁ గనుదోయిన్ బాష్పము ల్గ్రిమ్మ గ
ద్గదకంఠమ్మున వాక్యము ల్తడఁబడన్ తద్గేహముం జొచ్చి యా
సుదతీరత్నము కాంచె బాలుని మనశ్శోకానలజ్వాలునిన్. (తిమ్మన్న)

చ. వయసునఁ బిన్నవాఁడ నభివంద్యుఁడ నౌదునె మీకు నంచు సం
శయ మొనరించెదేని మునిసత్తమ ! కార్యములందు నాగమా
ధ్యయనములందు మంత్రములయందుఁ గనిష్ఠుఁడ యేని పెద్ద ని
శ్చయ మిది వానియం దఖిలసన్నుతమైన సువిద్య గల్గినన్.
(అ. సూరన్న)

౨. శ్రీరంగమాహాత్మ్యము-ఇది భైరవకవిప్రణీతము. * కవిగజాంకుశమును రచియించిన భైరవకవి యితఁడే యయి యుండవచ్చును-

చ. పరిచరుగాఁగ నేలె నిరపాయచరిత్రునిఁ బాపకానన
స్ఫురదురువీతిహోత్రుని సముజ్జ్వలమేరుసమానగాత్రునిన్
బరమపవిత్రునిన్ మునిసుపర్వవరస్తుతిపాత్రునిన్ మనో
హరఫల శేముషీకబళితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్. (అప్పకవి)

ఉ. గందపుఁగొండనెత్తములకందున నేలకితీవయిండ్లలోఁ
గెందలిరాకుపాన్పున సుఖించి నితాంతరతిశ్రమంబునం
జెందిన చెంచుగుబ్బెతల చెక్కులఁ జిమ్ము జవాదివాసనల్
విందులు చేయుచు న్మెలఁగు వేఁకువఁ గోమలగంధవాహముల్.
(లిం. తిమ్మన్న)

* (ఈ కవిని గూర్చిన విషయము మొదటి సంపుటములోఁగలదు)

ఉ. ఆకులవృత్తి రాఘవశరాగ్రమునందు దృణాగ్రలగ్నసీ
రాకృతి వార్ధి నిల్చుట దశాననుఁ డీల్గుట మిధ్య గాదె వా
ల్మీకులు చెప్పకున్నఁగృతిలేని నరేశ్వరవర్తనంబు ర
త్నాకరవేష్టితావని వినంబడ దాతఁడు మేరు వెత్తినన్.

(కూ. తిమ్మన్న)

౩. త్రైశంకవోపాఖ్యానము—దీనిని సింగరన్న రచియించినట్లప్పకవి చెప్పు చున్నాఁడు. ఇందు హరిశ్చంద్రునికథ చెప్పఁబడి యుండవలెను—

క. ఝష కేతుద్విషునకుఁ గి
ల్బిషపర్వతవృషున కమృతవిషనిధిజామా
త్రిషునకు ఋషిపూజితునకు
విషమాక్షున కింద్రముఖదివిజపక్షునకున్.

క. డుంఠీరభైరవుని సితి
కంఠు విశాలాక్షి దండకరు జాహ్నవి పై
కుంఠపతి గుహుని లోలా
ర్కుం దేవలుమీఱ భూవరుఁడు పొడగనియెన్.

౪. శమంతకమణి చరిత్రము—ఇది వణుకూరి గుర్వరాజుచేఁ జేయఁబడిన దని యప్పకవి వ్రాయుచున్నాఁడు—

ఉ. కాయవచోమనస్థ్సలనకల్పితదోషము లెల్లఁ బాయఁగా
నా యెదలోన నిత్యము సనాతనధర్మముఁ బూని యర్మిలిం
బాయక కొల్తు రామనరపాల నిరంతరసౌఖ్యదాయి సే
తాయు సమస్తశోభనవిధాయి మహాఫలసిద్ధిదాయిగన్.

౫. శశిబిందు చరిత్రము—

క. నాకౌకసు లైనను నీ
డాకకు నిల్చెదరె కటకటా మముబోంట్లన్

జేకొని సంరక్షింపక
నీకిటు లుచితంబె యురవణింప నరేంద్రా !

[శశిబిందు చరిత్రమును రచించిన కవి చరిగొండ నరసింహకవి మహబూబు నగరు జిల్లా చరిగొండ నివాసి 1600 ప్రాంతమువాఁడు.]

క. నూవుంబూవును సంపెగ
పూవు గెలిచి బిరుదుము త్తెపుంజల్లి దగం
దావై చె ననఁగ ముంగర
తో వనరుహనేత్రనాసతుల లే కొప్పున్.

౭. చారుధేష్ణచరిత్రము—

గీ. అచ్చరులు నందనంబుఁ దెచ్చుకొను సు
రాగసుమములు హర్మ్యవాతాయనముల
చెంతఁ గాలూఁది తత్పురస్త్రీల కొసఁగి
వేఁడికొని పోవుదురు కప్రవీడియములు.

క. ఈ లలన వేలుపుంజవ । రాలో యచ్చరయొ కిన్నరవధూమణియో
వ్యాళాంగనయో కా కీ । భూలోకస్త్రీల కిట్టి పొంకము కలదే ?

౨. భేతాళపంచవింశతి—

ఉ. చోరగ్రాహగజాంకుశంబు నలినీషంఢన్మదేభంబు ది
వ్యారీమూ ర్తికదర్పణంబు రజనీకాంతామనోహారి వి
స్ఫారాంభోధితరంగకారి గిరిజాప్రాణేశభాస్వజ్జటా
శ్రీరమ్యాభరణంబు చంద్రుఁ డుదయించెన్ సుప్రభాభాసియై. *

* [పరిషత్తులోని సంకలన గ్రంథమును బట్టి 'భేతాళపంచవింశతి' పోతరాజుకృతమైనట్లు తెలియుచున్నది. ఈ కవి క్రీ. శ. 1560 కం టెఁ ప్రాచీనుఁడు.]

ఉ. ఆ విధవాశిరోమణి రయంబునఁ బోయి రహస్యవేళఁ బ
ద్మావతిఁ గాంచి రాజసుతుఁ డాడిన మాటలు విన్నవింప ల
జ్జావతి దానిఁ జూచి ఘనసారకరంబుల గండపాళికల్
వావిరి వ్రేసినన్ జరఠవారిజలోచన వచ్చె ఖిన్నతన్.

౮. చమత్కారరామాయణము—

క. ఓశశిముఖి ! లోపాము
ద్రేశుఁడు కలశభవుఁ డుండు నిట; నతఁడు తపో
రాశి మహాత్ముఁడు మును పా
పోశనముగఁ గొనియె సాగరాంబువు లెల్లన్.

క. నిన్నుఁజెఱఁగొన్న హైహయు
కన్నన్ దోర్వీర్యమెక్కుడగు భార్గవు లీ
ల న్నిర్జించిన రాముని
కన్నను శూరుండు ముజ్జగంబులఁ గలఁడే ?

౯. శేషధర్మములు—

క. పెట్టఁడు నారకమార్గం
బెట్టి మహాక్రూరకర్ముఁడేనియుఁ దుద ని
ట్టట్టనక నెమ్మనంబున
నెట్టన హరిఁ దలఁపఁ గలిగెనేని మహాత్మా !

[కొనాల నరసింహకవి 'శేషధర్మము' లను 8-అశ్వాసముల గ్రంథముగా రచించెను. ఇది యదేమో ! ఈ కవి 200 ఏండ్లక్రిందటి వాఁడు.]

౧౦. విజయసేనము—

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసం దగు లూఁది యిమ్మెయిన్
దల్లడ మందెదేల ? యుచితస్థితికి న్ననుఁ బాపఁజూచినన్

దల్లియు బంధులోకమును దండ్రియు నేమను వా రెఱింగిరే
మల్లమ యిట్లు నీకుఁ దగునో తగదో పరికించి చూడుమా.

౧౧. దేవీవిజయము—

గీ. వాక్త్రిణేత్రాంగనాశచీశక్తు లధిక
సంభ్రమంబునఁ గుంభనికుంభదైత్య
హంత్రిఁ బూజింపుదురు త్రయీమంత్రములను
స్తోత్రములు చేసి మంగళారాత్రిక లిడి.

౧౨. మధుసేనము—

క. పో నుద్యోగము చేసిన। ప్రాణంబా యింక నీకుఁ బాథేయం బీ
మానినిమందస్మితసుధ। రాననచంద్రికలు గ్రోల నరుగుము పిదపన్.

౧౩. అనిరుద్ధచరిత్రము—కనుపర్తి యబ్బయామాత్యప్రణీతమయిన యీ పేరుగల యాధునికప్రబంధ మొకటి కలదుగాని యీ క్రింది పద్యము పూర్వగ్రంథములోనిది— *

చ. నెలవుల నుప్పతిల్లి సరి నిక్కి మొనల్తల లెత్తి క్రొవ్వి లో
బలిసి సమంబులై బిగిసి వట్రువలై మెఱుఁ గెక్కి చక్కనై
కెలకులఁ బిక్కటిల్లి చెలికిం గడునొప్పెఁ గుచంబు లొప్పుకు
ప్పలుగను మన్మథుండు సరి వాఁలగఁ ద్రాసునఁ దూచెనోయనన్.

౧౪. శూద్రక రాజచరిత్రము—

మ. సమదేభారి మసంగి పై నుఱికినన్ శంకించి భూపాలుఁ డో
లము గన్నుం గని దాని శూద్రకుఁడు లీలం ద్రుంచె నే నప్పు డ
త్యమలోద్యత్ప్రసవార్థినై కుసుమగంధఘ్రాణలుబ్ధభ్రమ
ద్భ్రమరభ్రాజితపాటలీవిటపమధ్యస్థుండనై చూచితిన్.

* ['అనిరుద్ధచరిత్ర' మొకటి (భావన పెమ్మన రచించినది కలదు. 1560 కంటె నితఁడు పూర్వుఁడు.]

౧౫. ఆదినారాయణ చరిత్రము—

ఉ. శ్రీయుతలోచనోజ్జ్వల మరీచులు భానుమరీచివిస్ఫుర
త్తోయజకాంతితోడఁ దులఁదూఁగెడు పచ్చనిపట్టు గట్టి య
త్యాయతశంఖ చక్రరుచిరాసిగదాధరుఁ డేగుదెంచె నా
రాయణుఁ డార్తరక్షణపరాయణుఁ డాకరిరాజుపాలికిన్.

౧౬. పంచబాణవిలాసము—

క. చిత్తంబుల రంజిల్లుచు
ముత్తైదువ లపుడు గదిసి పూవిల్తునకున్
బిత్తరికిఁ బలుదెఱంగుల
నెత్తిరి హారతులు పౌరులెల్లఁ జెలంగన్.

౧౭. ప్రద్యుమ్నోపాఖ్యానము—

క. పంచశరుం డవు డని చా
లించి మహాప్రధనభూమి నీక్షించి మదో
దంచితుఁడై శంఖము పూ
రించెం గులగిరులు దిక్కరివ్రజ మదరన్.

[ఇది ప్రద్యుమ్నచరిత్రము కావచ్చును. పొన్నాడ పెద్దిరాజు దీనికిఁగర్త ఇతఁడు 1560 కంటెఁ బ్రాచీనుఁడు.]